దేశి సారస్వతము — ౨

# పల్లెపదాలు



"కృష్ణశ్రీ"

సంకలితము

వెల 3-8-0

# ముందుమాట

ఏ దేశంలోనైనా వాఙ్మయం పాడుకోవడానికీ ఊరికే చదువుకోవడానికీ వీలుగా ఉండడంమామూలు. ఇంత మాత్రానికే గేయ వాఙ్మయమనీ, జానపద వాఙ్మయమనీ పెద్దపెద్ద పేర్లు పెట్టినా, ఎన్ని విధాల మార్పులూ చేర్పులూ చేసినా ఇవన్నీ కూడా దాన్ని ఉపయోగించుకొనే వాళ్ళను బట్టి వచ్చేవేకాని అసలువస్తువులో మాత్రం ఏ తేడా కాన్పించదు. చదివినా లేక పాడుకొన్నా ఆసాహిత్యంలోని వస్తువులో ఏ విధానైనా మార్పుకల్గుతుందా? కల్గబోతుందా? అథవా కల్గిందా? ఇంకొకటి కూడా మనం బాగా పరిశీలిద్దాం. ఋగ్వేదం ప్రపంచంలోని అన్ని దేశాల్లోని అన్ని భాషల్లోని సాహిత్యం కంటే కూడా చిట్టచివరికి గాథిక్ భాషకన్నా కూడాచాలా వెనకటిదని అందరికీ తెలిసిందే. అందువల్లనే కదా సామవేదంలో పాడడానికి వాడబడేవి చాలా ఋగ్వేదంలో ఋక్కులేఅని అంటారు. అయితే ఈ పాటలు ప్రాకృతజనుల వాడుక మాటల్లో ఉన్నవికదా? ఋగ్వేదాదులట్లాలేవే అని సందేహిస్తారా? చూడండి ఋగ్వేదాదులు కూడా ప్రాకృతంలోవే. తెనుగువాడైన దండి మహాకవి ఈ విషయాన్ని తెగేసి చెప్పినాడు.

“సంస్కృతం నామ దైవీ వాగన్వ్యాఖ్యాతా మహర్షిభిః” అని కొన్నాళ్ళకు పాణినిలాంటి మహాఋషులు వెనకటి కాలపు మొదటి ప్రాకృతాన్ని అనగా ఋగ్వేదాదుల్లోని భాషను సంస్కరిస్తే సంస్కృతం అయిందట. ఈ విచారమంతా ఎందుకయ్యా అంటే సాహిత్య మంతా గేయంగానూ లోకుల వాడుకభాషల్లోను గూడా ఉండదగినదే అని చెప్పడానికి.

అయితేకొన్ని అట్లాఉండనివిగూడా లేకపోలేదు. మచ్చుకి జయదేవుడి అష్టపదులు చూడండి. అవి అప్పుడు వాడుకలో లేని సంస్కృతంలో రాసినవే. అవి అర్థంలో ఎంత అందంగా ఉన్నా [illegible] స్వభావంలో లోకులకు అందకుండా పోయింది. కనుకనే ప్రాకృతంలోని యీ పాటలు ఏనాడు ఎవరు చెప్పినవోగాని అవి యెవ్వరి ప్రయత్నమూ అక్కర లేకుండానే ఇంత కాలంవరకూనిల్చి వున్నవి. లోకుల నోళ్ళలో

వానుతూ జీవంతో ఉన్నవి. పాటలు ప్రాణేవాలింపుమూ ఈవిషయాన్ని ముఖ్యంగా గమనించాలె.

పూర్వకాలంలో హాలుడనే చక్రవర్తి రెండుమూడు యేండ్లనాడు అనేకులు కైతగాళ్ళూ, కైతగత్తెలూ చెప్పిన పాడిన గాథలనుంచి ఏడువందలుగాథల్ని మనవాళ్ళ వాడుకలు అలవాట్లనూ జీవనాన్ని ఇంకా ఇంకా అనేకాలనూ తెల్పి చెప్పాడు. అయితే ప్రాకృతంలో పాటలు యేల పాటలు. అసలు "హేల" అనే సంస్కృతం నామం "ఏల" గా అయింది. "హేల_భావకరణో" అనిధాతువు. దీనివల్ల యేమి తెలుస్తుంది. భావాన్ని ఉద్బోధించేటి లేక భావోద్రేకాన్ని వెలువరించేటి పాటలు అన్న అర్థం స్ఫురిస్తుంది. భావాలు ఎన్నో రకాలుంటవి.

"ఆపతి కాలాన భూపతిరాజా అన్నంబు పెట్టాడే ఆదరించాడే" అని వడ్లు దంచేటప్పుడు పాడేపాట దంపుడుపాటంటారు. ఇందులో ఆ భూపతిరాజు చేసిన ఉపకారం ఆపత్కాలాన ఆదుకోవడాన్ని జ్ఞాపకం తెచ్చుకొని స్మరిస్తాము. ఇట్లాగే "ఇల్లాలని కేల యింత పోకిళ్ళా గొల్లాలని కేల గొడుగునీడాళ్ళా" లాంటిట్లో చక్కటి ఉపమానంతో మనసుకు తగిలేట్టు ఇల్లాళ్ళను వెర్రి మొర్రి పోకిళ్ళు పనికిరావని చెప్పటం అయింది. సాగినయౌవ్వనాన్ని భర్తృహరి యింకో తీరున తన కావ్యంలో తెల్పినాడు.

"ఇదమనుచితమక్రమశ్చ పుంసాం । యదిహ జరాస్వపి మాన్మథా వికారాః
తదపిచ న కృతం నితంబినీనాం । స్తనపతనావధి జీవితం రతం వా"

నిజంగా పరిశీలిస్తే సంస్కృతంలోనే కొంచెం మోటుగా వుండేదానిపాటు
వుగా నున్నితంగా వ్యంగ్యంగా అభిప్రాయం తెల్పబడింది. మరొకటి

"ఊరూర సీకటి యిరులూ, ఉత్తుత్తని కదిలే కురులూ,
ఊరిలోన శాసావోరూ, ఊ అంటేను వరికోరూ,

ఇందులో ప్రతిచోటా 'మొగముమీద ముంగురులు చెరలాడుతున్న పడుచుల వయ్యారాలు వాటిని చూడగానే మోహాంధకారంముంచుకోవడం అనేశృంగారంతో

కూడా ఈ అవినయశృంగారాన్ని అనుభవించడానికి ఉండే అడ్డంకిని తెల్పడంలో కొద్రం కూడ భయంకరంగా అంటే ప్రాణానికే మోసం కలుగుతుందన్నట్లుగా వ్యంగ్యం అయింది. ఇట్లాంటిదే చాలకాలంనాటి ప్రాకృతగాథల్లో ఉంది కాని యీ యేలపాట దాని కంటె సభ్యమై చాలాగంభీరంగాను లోతుగాను సాజూపుగానువుంది. ఈ యిన్నిరకాలపాటలూ అన్నికూడా యేలపాటలే. అయితే ఎట్లా ఏర్పడ్డాయోకాని వీటిలోకొన్ని యేలపాటలనీ, కొన్నిదంపుడు పాటలనీ కొన్నిసువ్వాలని కొన్ని కోలపాటలనీ యిట్లాపంపకా లేర్పడ్డాయి ఈపుస్తకంలో అటువంటి పాటలు చాలారకాలున్నాయి. రాట్నంపాటలు, కవ్వంపాటలు, పడవపాటలు, కోతలపాటలు, ఊడ్పుపాటలూ, తుమ్మెదపదాలు, కోపులు, ఇట్లాఒకటా? రెండా? అనేకరకాలున్నాయి. ఇవన్నీ తెల్గుదేశంలో ఇప్పుడూవాడుకలో ఉన్నవే. క్రమంగా నాగరికత బలపడిన కొద్దీ ఈపాటలు అంతరించిపోతున్నవి. కారణమేమిటంటే పూర్వంలో ఏకొద్దిమంది ప్రభువుల పెళ్ళాలోకాని మిగతా ఆడవాళ్ళంతా తమతమఇళ్ళల్లో వడ్లుదంచు కోవడం, పొలాల్లో పనులు చేసుకోవడం, గడ్డికోసు కోవడం, పిండివిసురు కోవడం, మొదలైన పనులుచేసుకుంటూ వుండేవారు. ఏటికో చెరువుకో, కాలవకో, కోనేటికో బావికో చెలమకో పోయి నీళ్ళు తెచ్చుకొనేవాళ్ళు. ఆయావేళల్లో ఆడ వాళ్ళకు అప్రయత్నంగానే ఆయాభావాలతో పాటలు వాటంతట అవినోటి వెంట బయలు దేరి వస్తుండేవి. ఆయా సంఘటనలు, సంఘర్షణలు, సమావేశాలు, సందర్భాలు వీలుకొద్దీ ఏర్పడు తుండేవి. మంచెలమీదనుండి చేలుకాయ డానికి వున్న చిన్నచిన్నపిల్లలు పడుచులు, గడుసరులు, అమాయికలు, మొదలైన వాళ్ళకు కొం డెగాళ్ళతో నానారకాలు భావాల్ని వ్యక్తం చేసేపదాలు ఆయాసమయాల్లో వాటంతటవే బయలుదేరుతుండేవి. అవన్నీ యీనాడు పోయినవి. కొళాయినీళ్ళూ, మరచియ్యాతా, కాఫీలతో సతమతయ్యే ఆడ వాళ్ళు [illegible] న్నలం పడడానికి పోతున్నారు. పింపుస్ప నగ్నరాలు సెలవుతీసుకొన్నాయి.

రి నాగరీకంలో మనజాతి అలవాటులన్నీ పోవడమే

, అందం, శృంగారం, ఉత్సాహం, మంపు, పెంపు,

హాసం, ధైర్యం, వీర్యం, పనిపాటల మీదిమోజు,

నిజమైన చక్కదనాన్ని గ్రహించే తెలివి, ఆదరించేపాటి ఓర్పు, అభినందించేపాటి చేర్పు, అనుభవించేపాటి కూర్పు, ఆనందించేపాటి నేర్పు, నెమ్మదీకూడా నశించిపోయినవి. అవన్నీ తలుచుకొంటే మనకు మళ్ళీ పడుచుదనంవస్తుంది. ఆనాటి అసంగతులన్నిటినీ కాక

పోయినా కొన్నిటినైనా మనకీయేలపాటలు జ్ఞాపకంలోకి తెచ్చి మన అనుభవంలోకి అందించి, మనకు అమృతంలాగ పనిచేసి మనను మళ్ళీ వెనుకటి కాలపు మంచి మనుష్యులనుగా తయారుచేయడానికి తప్పకుండా పనికివస్తవి.

ఈ పాటలు తెలుగుది జాతి జీవనం అంతా కళ్ళకు గట్టేటుగా చూపుతవి. తెలుగుల బ్రతుకు అంతా వానదేవుడినుంచీ వరికోతల దాకా, వ్యవసాయం నుంచీ వీరత్వం దాకా, కోడినుంచి కత్తిదాకా, ఇంతెందుకు కుంకుమ దగ్గరి నుంచీ దేవతార్చన దాకా, అద్దంపలె కనబరుస్తుంటాయి ఈ పాటలు. వీటిని తెలుగు వారందరూ ఆదరించి తీరవలిసిందే. అభినందించవలిసిందే. అనుభవించవలిసిందే. ఆనందించవలిసిందే.

హైదరాబాదు.
మన్మధ సంక్రాన్తి

శిరోమణి
వేదాల తిరువేంగళాచార్యులు

# ౧ వాన దేముడా

—అనాది యని పరిగణింపబడే వేదవాఙ్మయంలోనే ఎన్నో ఋక్కులు పంటలను కీర్తిస్తున్నవి. సుజలమూ సుఫలమూ సస్యశ్యామలమూ అయిన భారతావనిలో వ్యవసాయమే నిత్యపరిశ్రమా జీవనాధారమున్నాను. అందువల్లనే,

వానల్లు కురవాలి వానదేముడా
వరిచేలు పండాలి వానదేముడా
నల్లాని మేఘాలు వానదేముడా
చల్లంగ కురవాలి వానదేముడా
చేలన్ని నిండాలి వానదేముడా
మూనాలు ఎదగాలి వానదేముడా
ఎన్నులు వెయ్యాలి వానదేముడా
పన్నగ సేలన్ని వానదేముడా
పంటల్లు పండాలి వానదేముడా
భాగ్యాలు నింపాలి వానదేముడా
పండుగలు సేస్తాము వానదేముడా
మాపూరి చెరువైన వానదేముడా
ముంచెత్తి పోవాలి వానదేముడా
కప్పలకు పెళ్లి వానదేముడా
గొప్పగ చెయ్యాలి వానదేముడా

అని ప్రార్థిస్తారు జనపదాలలోని జనులందరూ. చల్లగా కురవవాలెనట వానదేవుడు! మొనలు యెదగాలి, వెన్నులు వెయ్యాలి. చండదిగ్వేదండతుండని భాఖండ వారి ధారలు కవులకువలె కర్షకులకు అక్కరకురావు. చెరువులు ముంచెత్తిననే, కప్పలకు పెళ్లిళ్లు భోగు కలంగిననే—భాగ్యాలు నిండగలవు.

## ౨. ఏరువాకమ్మ

—వానలుకురిసి పొలము పదునెక్కగానే మక్కెజొన్నలను పూన్చి రైతు ఏరువాకను సాగిస్తాడు. ఏరువాక! ఎంతముద్దైనమాట! మన జీవనములకు జీవము ఏరువాక. ఎడ్లకు పసుపుకుంకుమలు పూసి, ఏరును పూలమాలలతో నలంకరించి ఏరువాకకు మంచి ముహూర్తమున పూజలు చేస్తారు. సమ్మోదభరితులై కర్షకులు

ఏరువాకమ్మకీ యేమి కావాలి
ఎర్రఎర్రని పూలమాల కావాలి
ఎరుపు తెలుపుల మబ్బుజెండ కావాలి
ఏరువాకమ్మకీ ఏమికావాలి ?
పొలము గట్టున నిలిచి వేడుకోవాలి
టెంకాయ వడపప్పు తెచ్చిపెట్టాలి
ముత్తైదు లందరూ పాటపాడాలి
పాటపాడుతు తల్లిపాదాలు మొక్కాలి
ఏరువాకమ్మనూ ఏమికోరాలి
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి
పాడి పంటలుకోరి పరవశించాలి.

ఎర్రెర్రని పూలమాలలు ఊగుతుండగా, పసుపు కొమ్ములు ఎడ్ల శిరములమీద అందపు టలలు తీర్చుతుండగా, ఎరుపు తెలుపుల మబ్బుజెండలో ముత్తైదుల పాటల ఉత్సాహములో జరయు మృతియులేని ఏరువాకకు మరియొక పుట్టిన దినము జరుగుతుంది.

# 3 ఊడుపు

—పొలము దుక్కిపూర్తి అయి నీటితో నిండి మొక్కలన్నీ కోరుతుంది. రంగు రంగుల చీరలు కట్టి వరుసతీర్చి మాలెతలు వంగి నాట్లు నాటుతారు. నాటుతూ సరదా కోసము పాటలు పాడతారు. దేనిని గురించి? ఊడుపును గురించే!

ఊడుపుడవం డమ్మలాలా మీ
రుడవండీ దమ్ము సేసిన సేలల్లో
ఊసులాడుకోని ఊరుకోబోకండి
ఇడదీసి వరిమొక్క లెడమెడముగ పాతండీ || ఊడు ||
బాడనక బందనక పాటుపడి నామంటే
మారాజు పనిసూసి మన కీనామిస్తాడు || ఊడు ||
ఆవూరి మారాజు ఐదణాలిస్తేను
ఈవూరి మారాజు ముప్పావలిస్తాడు || ఊడు ||

పాపము రెక్కాడినగాని డొక్కాడని ప్రాణులు. ఊరినుంచి ఊరుకి నడచి సాగిపోతూ ఏవూరి మహారాజైనా పని చేస్తాడా అని చూస్తుంటారు. వారి పని చూచి ఇనాము లిచ్చే మహారాజు లెందరో!

---

# గునాసారి గున్నమ్మ

—అయితే కూడుకి పస్కాసైతే గుణానికి తప్పకవా ? వినండి వారి దినచర్య ! ఉషస్సున లేచినది మొదలు సూర్యుడు కుంకే వరకు పొలమూ, గొప్పూ, నీరూ, కోత, కొలత. వీళ్ళేకాదా దేశానికి ధనము !

వొడినిండ పసుపేస్కో వొయ్యారమేనే
గునాసారి గున్నమ్మా
పొద్దున్న నువులెగసి పొలానికెళ్ళే
గునాసారి గున్నమ్మా
ఎండెక్కి సూరీడు కొండెక్కిసూసే
గునాసారి గున్నమ్మా
గంపకిందాకోడి కంయ్యిమనకూసే
గునాసారి గున్నమ్మా
గొప్పతవ్వేకాడ కొప్పెందుకోలే
గునాసారి గున్నమ్మా
గట్టెక్కి సూత్తాడో గవరయ్యకాపు
గునాసారి గున్నమ్మా
మప్పేన్నం యేలపుడు మరిదప్పికేత్తే
గునాసారి గున్నమ్మా
నట్టిగెంజి కాంతతాగి మరివుండు
గునాసారి గున్నమ్మా
ఆకుమళ్ళాలోను ఆకెండిపోయే
గునాసారి గున్నమ్మా

తోడ్రర నీరంత బావుల్లనుంచీ
గునాసారి గున్నమ్మా
కుప్పా నూర్పులకాడ కూకున్నవేమే
గునాసారి గున్నమ్మా
పండినాసేలోకి పయినామై ఎల్లీ
గునాసారి గున్నమ్మా
కొయ్యండి కోతాలు కొడవళ్ళతోటీ
గునాసారి గున్నమ్మా
కొయ్యించి పొయ్యండి గాడెల్లలోనూ
గునాసారి గున్నమ్మా
కుప్పించి కొలవండి కుంచాల తోటీ
గునాసారి గున్నమ్మా
ఎత్తండి బళ్ళాకి ఎగుదిగుడులేకా
గునాసారి గున్నమ్మా

వీరి కల్పనలు వీరి జీవితాల్లాగుననే సహజ సుందరముగా ఉంటావి. పని ఇచ్చే మహారాజుకి వీరు కల్పించే వాసన బాటలు చూడండి.

---

## ౩ ఓ య న్ని దా య లా ల

ఓయన్నిదాయలాల
గొబ్బియాలాలో ...ఓ

కుంటా పూవాసనకు
రాయుడు రాంగా
కుసుమపూవాసనకు
కుంట దాటెల్లె

ఓయన్నిదాయలాల
గొబ్బియాలాలో ...ఓ

కుంటాముగదికి
రాయుడు రాంగా
మల్లెపూవాసనకు
మారు దాటెల్లె

ఓయన్నిదాయలాలో
గొబ్బియాలాలో ...ఓ

చెరువు ముంగిటికి
రాయుడు రాంగా
సెనిగపూవాసనకు
చెరువు దాటెల్లె

ఓయన్నిదాయలాలో
గొబ్బియాలాలో ...ఓ

బాయి ముంగటికి
రాయుడు రాంగా
బంతిపూవాసనకు
బాయి దారెల్లె

ఓయన్నిదాయలలో
గొబ్బియాలాలో ...ఓ

ఈ కూలిజనముపలెనే ఏ మూలనోపుట్టి పరిమళించేవే సెనగపూలూ, బంతిపూలూ, ఎక్కడో ఒక తుప్పలో మల్లెపూవులున్నూ. రాయుడికి ఎక్కడికి పోయినా పూలసౌరభమే.

— వీరి బ్రతుకుబాటల తిన్నదనము 'కామందు'ల సిరిసంపదలమీదనే ఆధారపడుతుంది. వారి పాడిపంటలూ, పిల్లపాపలూ, ఆవుగోవులూ చల్లగా వుండవాలె. కూలిజనమేకదా రైతుల కుల పురోహితులు !

---

## ౭ రాయినా శందనాలు

రాయినా శందనాలో ఓయి బావల్లాల బావన్నిలాల ...బావ
రామలచ్చన్లాటి రాజూలులేరు సీతమ్మలాటి యిల్లాలులేదు
పాడిపంటలు సల్లగుండాల మా కూలి రైతుల కడుపునిండాల
మాకాడవందులు సల్లగుండాల దండిగ మా సేలుపండాలి ...రామ
ఉత్తారవచ్చే ఎత్తారగంప కారుమేఘా లాకాశంబునిండె
తొలకర్లో వరసాలు కురవాలి ఎకరానికి బత్తాలు పండాలి ...రామ
నీరుపెట్టి దుక్కుదున్నాలి బాబు దుక్కుదున్ని మొక్కసాటాలి బాబు
మా రయితుబాబులు బాగుండాలి ఆరిపిల్లపాప సల్లగుండాలి
ఆరిఆవుల్ని గోవుల్ని మేముకాయాలి కాసినందుకు మాకు నూకలియ్యాలి
పల్లెటూళ్ళు బాగుండాలి పట్నాలు కడుపూలు నిండాలి
సిన్నపెద్దలు కలిసుండాలి ఏఊరుకావూరు ఎంతో బాగుండాల... రామ
పైరుకంకులపైని పిల్లపిట్టలువాలె ఇల్లాగరానువ్వు పిల్లోడ
కొట్టకుండానువ్వు తిట్టకుండానువ్వు అందర్ని బెదరిస్తె అవతలకుపోవురా
...రామ

పాపము తమవలెనే బ్రతుకుతెరువుకు పొలాలమీద ఆధారపడతాయి పిల్ల పిట్టలు కొట్టకుండా బెదిరిస్తే అవతలకు – మరో పొలానికి–పోతాయిట. అందమైన సజాతీయభిమానము ! కాదంటారా ?

## ౭ నాట్లు నాటుతూ

గట్టూమాకులుగట్టి గడలూ బొందిచ్చి
గట్టురాయని ఇంట్లొపుట్టె గౌరమ్మ
పుట్టుటే గౌరమ్మ ఏమేమిగోరు
కుట్టూ వయ్యారివవికె, కుంకుమా కాయ
జాలవయ్యారివవికె జామాలపేరు
వంకా చక్కటికుడుక వజ్రాలపేరు
నీచేతి కంకణము ఏదే శ్రీగౌరు
ఆడబోయినకాడ ఏడబోయినదో

కల్పన పొలాన్నిదాటి గౌరమ్మను మలచింది. గౌరమ్మ రత్నాల గట్టురాయని గాదిలికోడ్డ. కంకణము జారుటను గుర్తించునవసర మామెకేల ? తల్లి అయినా కూతురు చేతి కంకణము ‘ఏది ?’ అనే అడిగినది. “ఆడబోయినకాడ ఏడబోయినదో” నట ! ఈ వాతాయన ములోనుండి గట్టురాయని సిరికొండరాయి గోచరింపగలదు.

---

## రా వరికలుపు పాట

— వరిచేనులో కలుపుతీస్తున్నప్పుడు, అంటే పొలాన్ని నిర్మాలిన్యము చేస్తున్నప్పుడు కూలివారి కల్పన సుకుమారికోమలిమీదకి ప్రసరించింది. బంగారు బిందెలోని చేమంతికట్టల లోని చిన్నపు మంచపు సన్నపు నులకమీద పండుకున్నదట జాణ లక్ష్మమ్మ! పాటసంతా వినండి.

చిక్కుడూ ఆకుల్ల వెన్నియ్యాలో
శివసద్దులుగట్టి వెన్నియ్యాలో
చిత్తూరు నేబోదు చుట్టాలజూడ
అక్కడెవరున్నారె అంభోజిరాజు
మా అమ్మతమ్ములు మాకు మేనమామలు
మముగన్నతండ్రికి బావమరదులమ్మ
బావమరదులుగూడి బాయితోడించిరి
బాయిలో ఉన్నది బంగారిబిందె
బిందెలో ఉన్నది చామంతికట్ట
కట్టలనైవున్నది చిన్నపు మంచము
చిన్నపు మంచానికి సన్నపునులుక
దానిమీద పండేటి జాణలెవరమ్మ
పనిజేసె లక్ష్మమ్మ పవళించినాది
విసనగఱ్ఱలతోటి విసిరిలేపన్నా
విసిరినా లేవదు విరజాజిమొగ్గ
కొబ్బరాకుడకలతో కొట్టిలేపన్నా

కొట్టినా లేవదు కోమటోరిపట్టి
డొప్పళ్ళ గంధంబు గుప్పి లేపన్నా
గుప్పినా లేవదు ఈ గురిజలబంతి
దొడ్లో పసులెళ్ళె దోరఎండలొచ్చె
ఇకనన్న లేవవే దొడ్డివారిబిడ్డ
మందపసులెళ్ళె చూరుఎండలెక్కె
ఇకనన్న లేవవె మా అమ్మ కోడలా

దోరెండలూ చూరుటెండలూ, దొడ్డిగొడ్లూ మందపసువులూ మేతకు పోయేవేళ్లే; సూర్యుడుకాదు దినాన్ని నడిపేది! కోళ్లూ, పశువులూ పాలెవాళ్లూనూ. మచ్చపడని చైతన్యము కనపడుతుందికాదూ పల్లెటూళ్లలో?

— ఊడ్పులూ కలుపుతీతలూ అయిపోతే పల్లపు పొలములలో పనులుండవు. మళ్లీ కోతనాడే కూలిజనముల కోలాహలము.



## ౬.- కోత పాట

కోతకొయ్యండమ్మలాలాం సేలు
కోరుకున్నా మన్మలాలాం
ఆరు మూడు కాలమైన
అసలుకి మరి కొసరులేదు ...కోత
సోడిసేలు యెన్నులేసి
సోలెడు గింజలకైతే
పాలికాపు బత్తేలకు
సాలొచ్చును కొయ్యండీ ...కోత
దసరా భోగాలంటె
అసరా తీరుస్తాయి
పసరాలకి కసవుంటే
భాగ్యాలే పండాయి ...కోత
సాలొచ్చిన మారాజు
సెయిముల గాయిస్తాడు
కాను సేతపడితేను
గగనమందేముసేను ...కోత

రైతుకు చాలివచ్చినవే చెయ్యాసులగా గింజలుకూడా కూలీవాళ్లకి యిస్తాడు. లేకపోతే ఒప్పుకున్న కాసుమాత్రమే.

— వరిపొలాలకు ఈ చిక్కు లేదు. వర్షపాత మెట్లున్నా 'మన్నెపుగొండపై మబ్బులో మెరుపు తీసిపోయిన నదిని పోషించి' పంట కందించగలదు. వరిచేలలోని చిక్కులు వేరు.

# ౧౦ కోతపాట

కొయ్యండల్లా కొయ్యండీ
కోసీ బణుపూ లెయ్యండీ
వానల వరదల వంగిన సేను
వెన్నుల సీనిన వన్నెల సేను
తెన్నగడీసీ మొదలూ కోసీ
పనలన్నీని పొంజెట్టావా
గింజలు బందలొ పడిపోకుండా
పొందుగ వెన్నులు కొయ్యండల్లా
కాలంసూత్తే సీతాకాలం
కొడవలిపాటూ జాగర్తల్లా
కాలూ సెయ్యా ఆడింతేనే
కుండలొ కూడు కలిసొత్తాది.

పనిచేస్తున్నప్పుడు పాడే పాటల వస్తువు ఆ పనికి సంబంధించినదే. దేవాలయ గోపురానికి అలంకారాలు ఆ గోపురపు ప్రాస్వరూపములే. భారత దేవాలయాన్ని అలంకరించిన మనసులే ఈ బృహదాంధ్ర సారస్వతాన్ని నిర్మించినది.

---

# ౧౧ గొంతెమ్మ పాట

— తుమ్మెద పదములు, వెన్నెల పదములు పాల్కురికి సోమనాథుని కాలమునాటికే తెలుగునాట వెలుగులెత్తినవి. మొదట వేదాంతబోధన. ఈ పదాలు అక్కరకువచ్చినా, కాలక్రమాన్న ఏ కథను పోతపోయుటకైననూ పనికివచ్చినవి. బలిసిన చేనులోపడి, చేతి కందిన పనలన్నీ కోసి 'పొంజెట్టు' లో అంపిరు కూలివారికీ లయ కుదిరేదు. ఏదో ఒకటి కుదిరించుటకు తుమ్మెదా అన్న పాటలాంటి పదాలు పనికివస్తవి. ఈ పాటను అంపుమోచేవారు పాడతారు.

తోటల్లాలోకి తుమ్మెదా, ఇరగబడి వచ్చింది తుమ్మెదా
దేవసిరినంది తుమ్మెదా, తేరగా వచ్చింది తుమ్మెదా
గొంతెమ్మ పెంచినా తుమ్మెదా, గొలుసుల్లానంది తుమ్మెదా
యీనిన వరిసేలు తుమ్మెదా, యీదివిడ దొక్కింది తుమ్మెదా
అల్లమూ చెడతిని తుమ్మెదా, పేడకడేసింది తుమ్మెదా
అంతట్లొ ఆసేను తుమ్మెదా, కాపన్న వచ్చాడు తుమ్మెదా
ఎక్కడిది యీనంది తుమ్మెదా, ఏడాది యీనంది తుమ్మెదా
పండిన వరిసేలు తుమ్మెదా, పాయలడ తొక్కింది తుమ్మెదా
కట్టండి నందిని తుమ్మెదా, గాజుల్ల కంచాన్ని తుమ్మెదా
ఎయ్యండి నందికి తుమ్మెదా, ఏడుకట్ల చొప్ప తుమ్మెదా
పొయ్యండి నందికి తుమ్మెదా, గోలేలతో కుడితి తుమ్మెదా
అంటూనె కాపన్న తుమ్మెదా, గొంతెమ్మ మేడాకు తుమ్మెదా
మేడల్లొ గొంతెమ్మ తుమ్మెదా, యేలాగూను వుంది తుమ్మెదా
ఉయ్యాల్లొ గొంతెమ్మ తుమ్మెదా, వూగుతూ ఉన్నాది తుమ్మెదా

ఊగూగు గొంతెమ్మ తుమ్మెదా, సేరూలని పిండి తుమ్మెదా
"ఎక్కడిది యీనంది తుమ్మెదా, యేడాది యీనంది తుమ్మెదా
గొంతెమ్మ పెంచినా తుమ్మెదా, గొలుసుక్లా నంది తుమ్మెదా"
మానంది కొట్టొద్దు కాపన్నా, మన్నులా లిట్టొద్దు కాపన్నా
మానంది బందేలా తుమ్మెదా, మేలిచ్చు తామయ్య తుమ్మెదా
సోలతో సోలెడు తుమ్మెదా, మాడలేసూకోని తుమ్మెదా
ఇదిగోర కాపన్న తుమ్మెదా, మానంది బంది తుమ్మెదా
ఇక్కడకు తీరదు తుమ్మెదా, మీనంది బంది తుమ్మెదా
తవ్వతో తవ్వెడు తుమ్మెదా, మాడలేసుకోని తుమ్మెదా
... ... ... ...
మానెతో మానెడు తుమ్మెదా, మాడలేసుకోని తుమ్మెదా
... ... ... ...
అడ్డలో అడ్డెడు తుమ్మెదా, మాడలేసుకోని తుమ్మెదా
... ... ... ...
కుంచముతో కుంచెడు తుమ్మెదా, మాడలేసుకోని తుమ్మెదా
... ... ... ...
పన్నెండు చెంగులు తుమ్మెదా, పట్టు పంచలూను తుమ్మెదా
పట్టుమన కాపన్న తుమ్మెదా, పైమీద కప్పింది తుమ్మెదా
చాలునని కాపన్న తుమ్మెదా, సంతోష పడ్డాడు తుమ్మెదా
మేడలో గొంతెమ్మ తుమ్మెదా, ఏలాగూ నంపో తుమ్మెదా
పొరుగూరిచేలోకి తుమ్మెదా, పోబోకు నందో తుమ్మెదా
పొరుగు బందులు మాకు తుమ్మెదా, తేబోకు నందన్న తుమ్మెదా
కట్టండి నందినీ తుమ్మెదా, గాజుల్ల కంబాల తుమ్మెదా
వెయ్యండి నందికీ తుమ్మెదా, వెయ్యికట్ల చొప్ప తుమ్మెదా ||

# ౧౨ నీలాటి రేవు

—ఎంత సేపూ పాలను ఘోషలేనా ? ఈ వెన్నెల పదను వినండి. ఇది కోత సమయంలో పాడుకున్నా; ఆరు బయట వెన్నెలలో పక్కలు వేసుక పండుకుని పాడుకున్నా; పండిన జొన్న కంకులు పళ్లెములలో పేర్చి ఇంటింటికీ తీసుకుపోతూ నవోద్వార్యము పాడినా అందగిస్తుంది. ఆరీతిగా పాడతారు కూడాను.

ఆగరగపట్టింది యెన్నెలా, నీళ్లాకువచ్చింది యెన్నెలా
పాపేడిసెట్టెక్కి యెన్నెలా, పలుకర్రియినయిరిసి యెన్నెలా
పగడాలరాయెక్కి యెన్నెలా, పలువరసతోమింది యెన్నెలా
ముత్యాలరాయెక్కి యెన్నెలా, మునిపల్లయినతోమె యెన్నెలా
నలుపైనరాయెక్కి యెన్నెలా, నాల్కుకైనగీసా యెన్నెలా
ముడికీడునీళ్లలో యెన్నెలా, మొకమైనకడిగింది యెన్నెలా
చేరెడునీళ్లల్లొ యెన్నెలా, చెయిజెబ్బాలుకడిగో యెన్నెలా
సుట్టుజిల్లరిసాపు యెన్నెలా, సుమ్మల్లుసుట్టిందో యెన్నెలా
ఆగరగముంచింది యెన్నెలా, ఒడ్డునాబెట్టింది యెన్నెలా
అట్టుఇటుసూసింది యెన్నెలా, ఎవ్వారులేరయ్యొ యెన్నెలా
గట్టుమీది కామన్న యెన్నెలా, గరగెత్తిపోరయ్య యెన్నెలా
నీకు గరగెత్తితే యెన్నెలా, నాకేమియిస్తావు యెన్నెలా
నాకు గరగెత్తితే యెన్నెలా, నా పాడావునిస్తాను యెన్నెలా
నీ పాడావునాకొద్దు యెన్నెలా, నీగరగ నేనెత్త యెన్నెలా
నాకు గరగెత్తితే యెన్నెలా, నా గున్నెద్దునిస్తాను యెన్నెలా
నీ గున్నెద్దునాకొద్దు యెన్నెలా, నీగరగ నేనెత్త యెన్నెలా

నాకు గరగెత్తితే యెన్నెలా, నా నాగరం యిస్తాను యెన్నెలా
నీ నాగరం నాకొద్దు యెన్నెలా, నీగరగ నేనెత్త యెన్నెలా
అయితయితే నీమనసు యెన్నెలా, నేనే వస్తాను యెన్నెలా

గరగ యెత్తినమాత్రానికే ఈ జాణ తానే వెంటవస్తుందట! కామన్న ఏమి తక్కువవాడా? ఆవూ, ఎద్దూ, నాగరమూ ఏదీ వద్దట! ఆయనగారుకూడా ఆఖరి మాటకోసమే ఎదురు చూస్తున్నట్టు కనిపిస్తాడు. ఈ సంవాదాలు సహజంగా ఈ రూపాన్న జరిగేవికావనీ ఇవి కల్పితాలే అనీ ఈ పాటల్లో చక్కగా తెలుస్తుంది.

# ౧౩ పోలిగాడు

— పోలిగాడు పంటలను సిద్ధింపజేసే దేవుడు. ఎక్కడైనా కుప్పనూర్పులు పోస్నలన్నిగాటి పోలిగాడు అక్కడ తయారు !

ఒలియా ఒలియా ఒలియా
రావేలు గలవాడ గారపోలిగాడ
తూర్పునా ఒకవాన తుమ్మెదల మోత
పడమట ఒకవాన పట్టికురవంగ
ఈ వాన ఆ వాన ఏక జడివాన
ఏవిలీ చేసుకూ ఎడ వాన లాగా
వెండి తూముల కింద వెల్లడము పండు
పైడి తూముల కింద పాలంకి పండు
రావేలు పోవేలు రాసి పదివేలు
రావేలు మాదయ్యా రాసి మాదయ్యా
పోలో పోలి పోలి పోలి
తిరుప తెంకన్నిచ్చిన పోలి
విను కొండం కమ్మిచ్చిన పోలి
పోలేలుగా చాల పోలి

## ౧౪ పొలిపాట

ఒలియ వొలియ...
ఒలియ వొలియా...వొలియా

కోటేలు గలవాడ రార పొలిగాడా
కోటేలు మీదయ్య కొండ మాదయ్యా
వెయ్యేలు కలవాడ రార పొలిగాడా
వెయ్యేలు మీదయ్య వెన్నె చూదయ్య
నూరేలు గలవాడ రార పొలిగాడ
నూరేలు మీదయ్య నూగు మాదయ్య
పదివేలు గలవాడ రార పొలిగాడా
పదివేలు మీదయ్య పంట మాదయ్య
రావేలు గలవాడ రార పొలిగాడా
రావేలు మీదయ్య రాశి మాదయ్య
ఎద్దులూ తొక్కంగ ఎదిగెనే రాశి
కోడెలూ తొక్కంగ కొల్లాయె రాశి
వెయ్యలూ తొక్కంగ పెరిగెనే రాశి
పొలిగాడు కొట్టంగ పోగాయె రాశి
వచ్చెనే పొలిగాడు పొన్నలూ దాటి
దాగెనే పొలిగాడు దండాకొట్ట*ల్లో

* కూర్పారబట్టినప్పుడు ఏర్పడే ధాన్యపు చార.

## ౧౫ పొలిపాట

వలియొ వలియొ వలియొ – రాగాల వలియొ
రావేలు గలవాడ – రాస పొలిగాడ || వలియొ ||
చైట కమ్మరి బిడ్డ – చంద్రుణ్ణి బోలు ,,
చుట్టుండు కాపూలు – చుక్కల్ల బోలు ,,
ఊరికి ఉత్తరాన – ఉత్తముడి సైక ,,
ఉత్తముడి సైకలో – రత్నాల పందిరి ,,
రత్నాల పందిట్లో – ముత్యాల కొలిమి ,,
మానెడు ముత్యాలు – మరుగైన కొలిమి ,,
తవ్వెడు ముత్యాలు – తరుసైన కొలిమి ,,
గిద్దెడు ముత్యాలు – గిలకలా కొలిమి ,,
వేసేటి సంపెట్లు – పిడుగులాం బోలు ,,
లేసేటి రవ్వల్లు – చుక్కలాం బోలు ,,
పల్లాపు చేలాకి – పదునాయె వాన ,,
గుంటకల నన్నూరు – గొర్రెలు మున్నూరు ,,
రఘురాము గొర్రుబట్ట – రంభ ఎదబెట్లు ,,
శ్రీరాము గొర్రుబట్ట – సీత ఎద బెట్టు ,,
సీత బెట్టినపైరు – చిగురాకులేసు ,,
రంభ బెట్టినపైరు – రవికాకులేసు ,,
దున్నలూ దొక్కంగ – దిన్నెలా పొడుగు ,,
ఎద్దులూ దొక్కంగ – ఎన్నులా పొడుగు ,,

# ౧౬ ఒలియొ ఒలియొ

ఒలియొ ఒలియొ ఒలియో ఒలియాలే
రావేలు కలవాడా రార పొలిగాడా
రావేలు మావయ్యా రాశి మాదయ్యా

పొలికాడే గొట్టంగ పోనారా రాశి
వచ్చేరా పొలిగాడు వాయువేగానా

పోయెరా పొలిగాడు పొన్నల్లుదాటీ
దాగెరా పొలిగాడు దండకట్టుల్ల

కోడెలూ తొక్కంగ కొల్లలై రాశి
ఎద్దులూ తొక్కంగ ఎదిగెరా రాశి

దున్నలూ తొక్కంగ దిన్నెలై రాశీ
పెయ్యలూ తొక్కంగ పెరిగెరా రాశీ

శ్రీశైలపర్వతము శిఖదేలె రాశీ
తిరుపతిగట్టులా దివ్యమై రాశీ
కాళహస్తీలాగు కళలూరె రాశీ
కోటప్పకొండలా గొప్పదై రాశీ
మంగళాగిరిలాగ పొంగెరా రాశీ
వేదాద్రిగట్టులా వెలిగెరా రాశీ
దుర్గగట్టులాగ తోచెరా రాశీ
సింహాద్రిగట్టులా చెన్నొందె రాశీ

రాశి యెత్తును చూచికూడా రైతు భగవంతుణ్ణి మరవడు! రాశి అతడు తిరిగే తిరుపర్వతములవలెనే కనపడుతోంది!

## ౧౭ నూర్పు పాట

అయిపోను గౌరమ్మ అయిపోనునమ్మ
ఆపైన గిరిమీద ఆడిరావమ్మ
మా జొన్నలయిపోను మేము పోతాము
మళ్లొచ్చి నీపాటలెల్లపాడేము

---

## ౧౮ పొలిపదం

— రైతు తెలివితక్కువవాడైతే ఎంత సంపదయినా గుటుకాయిస్వాహా అవుతుంది. చివరకి మిగిలేది ఏమిటి? చిత్తగించండి.

కల్లుదుర్గామొచ్చి; గూగుమ్మడీ;
కల్లములో, కూకుండె; గూగుమ్మడీ;
చేత పైసా లేదు, గూగుమ్మడీ;
ఏంపెట్టి త్రాగేది? గూగుమ్మడీ;
కాడి ఎద్దులనమ్మి; గూగుమ్మడీ;
కల్లు త్రాగయ్యా; గూగుమ్మడీ.
కల్లుదుర్గామొచ్చి, గూగుమ్మడీ;
కల్లములో, కూకుండె; గూగుమ్మడీ.
చేత పైసా లేదు, గూగుమ్మడీ;
ఏంపెట్టి త్రాగేది? గూగుమ్మడీ,
పాడి బర్లానమ్మి; గూగుమ్మడీ;
కల్లు త్రాగవయ్యా; గూగుమ్మడీ.
కల్లుదుర్గామొచ్చి; గూగుమ్మడీ;
కల్లములో, కూకుండె; గూగుమ్మడీ;
చేత పైసా లేదు, గూగుమ్మడీ;
ఏంపెట్టి త్రాగేది? గూగుమ్మడీ;
తల్లిదండ్రులనమ్మి; గూగుమ్మడీ;
కల్లు త్రాగవయ్యా; గూగుమ్మడీ.

కల్లుదుర్గా మెచ్చి, గూగుమ్మడీ;
కళ్లములో, కూకుండె; గూగుమ్మడీ;
చేత పైసాలేదు, గూగుమ్మడీ;
ఏంపెట్టి త్రాగేది? గూగుమ్మడీ;
పెళ్లాన్ని పరులకమ్మి; గూగుమ్మడీ;
కల్లు త్రాగవయ్యా; గూగుమ్మడీ;
పెళ్లాన్ని పరులకమ్మి; గూగుమ్మడీ;
బ్రతుకకుంటే నేమి? గూగుమ్మడీ;
కల్లుదుర్గామపుడు, గూగుమ్మడీ;
కళ్ల మెదిలిపోయె, గూగుమ్మడీ.

చావుకు పెట్టిన నేగాని లంఖణాలు వరకూ రాదు. పెళ్లాన్ని పరులకమ్మేవరకూ నడుపుతుందా కల్లుత్రాగుడు? అయితే వద్దన్నాడు. కల్లుదుర్గము కళ్లమునబడి పారిపోయినది.

---

# ౧౯ ఏతాము

పాట భారతీయులకు జాతీయకళ. పుట్టినరోజున పాట, తొట్టెకెట్టినప్పుడు పాట, అన్నప్రాశనానికి పాట, విద్దెముచేసినప్పుడు పాట, ఆడుతూ పాట, పెండ్లికి పాట, శోభనానికి పాట, సీమంతానికి పాట, భారతీయుల జీవితాన్నంతా పాట పడుపడుఅయి తేల్చి సాగిస్తుంది. గాన సరస్వతి అకచేత పెరిగిన తెలుగుబిడ్డ ఆటలలోనూ పాటలలోనూమాత్రమే కాక పనిపాటులలోకూడా పాడుకుంటూనే కష్టపడతాడు.

— ఏతాము విరిగినట్లయితే ముగ్గురికి చావు. అట్లని ఏతాముపట్టణము మానగలరా? గూళ్లు నొప్పనకుండా గూనలు లాగిననే మెటుకచేలు తడిసి గింజలు పండగలవు.

ఏత్తాము తోడరా తమ్ముడా, సీ
పొద్దైన సాయమదే తమ్ముడా
పాతాళ గంగమ్మ పైకుబికి పొంగింది
యేతాముతోడి మెటుకసేలన్ని తడపాలి
గూళ్ళు నొప్పనకుండ గూనలులాగాలి జెగి
సేలన్నితడిసి మరి మూనలు బాగెదగాలి
కట్ట తెగిపోకుండ కట్టండి గట్లన్ని
బద్దిపై సిన్నోడ భద్రముగా నడవాలి
పట్టుతప్పితె పళ్లు పలపలరాలాయిగాని
ఏత మెక్కినవాడు ఏరు కట్టినవాడు
ఏడేట పంటలతో యేలగాలి పదినాళ్ళు.

# ౨౦ ఏతాముపాట

— ఆశలు ఆశలనంటును. పాపము ఆచరణలో ఏతాము త్రొక్కుపాట్లు చూడండి.

ఏటి కేతంబెట్టి వెయిపుట్లు పండించి
ఎన్నడూ మెతుకెరగరన్నా
నేను గంజిలో మెతుకెరగరన్నా
కాజ్జేయి కడుక్కొని కట్టమీద కూసుంటె
కాకి దన్నీపాయెరన్నా – కాకి
పిల్ల దన్నీపాయెరన్నా
పోరుకూ జాల్లేక పాయికాడ కూసుంటె
పోరి దన్నీపోయెరన్నా – పోరి
తల్లీ దన్నీపోయెరన్నా
చుక్కపొద్దున లేచి బొక్కెనెత్తాపోగ
బొక్కబోర్లా పడితిరన్నా
నాదేటి బ్రతుకాయెరన్నా
నేను నాడే చావకపోతిరన్నా

వీడెవడో ప్రత్యేకముగా దురదృష్టవంతుడు. మెతుకుమాట దేవుడెరుగును, కాకిపిల్ల తన్నులుకూడా తిన్నాడు.

---

# ౨౧ గొడ్డలిపాట

నరకవయ్యా నరకవయ్యా నరకవయ్యా
'వాడేమికొట్టాడు ?' 'చింతచెట్టు'
'వీడేమికొట్టాడు' 'చిన్నచెట్టు'
'నీవేమికొట్టావు' 'ములగచెట్టు'
నరకవయ్యా నరకవయ్యా నరకవయ్యా
వాడేమికొట్టాడు ఓహో చింతచెట్టు
వీడేమికొట్టాడు అయ్యో చిన్నచెట్టు
నీవేమికొట్టావు ఇహిహీ ములగచెట్టు

ములగచెట్టు మహాపెళుసు. కొమ్మకొట్టిన పటుక్కుమని విరుగును. మొదటివాడు వస్తాదు చింతచెట్టును కొట్టినాడు. అడిగినవాడు ములగచెట్టు కొట్టినాడని "ఇహిహీ" అని నవ్వుతున్నారందరూ. వ్యవసాయముకొరకు అడవినరుకుతున్న దృశ్యమిది.

---

## ౨౨ దమ్మిడీ

అన్నిటికి నీవేగతి దమ్మిడీ
నీవెంతపనిచేశావె దమ్మిడీ
నిను పెట్టెలోనె పెట్టినానె దమ్మిడీ
నను మోసగించి పోయినావె దమ్మిడీ
అందరికి నీవెగదా దమ్మిడీ
ఏకాదశీనాడు, రాకాసినాడు
నీకోసం వచ్చినానె దమ్మిడీ

పాపము రాళ్లుకొట్టి సంపాదించిన సొమ్ము! పోయినచో కష్టముకదా! అందరికీ దమ్మిడీయే గతియట!

# ౨౩ పారపదము

—ఇదిగో ఈ పారపదము వినండి. ప్రారంభించినప్పుడు మొదటి భాగమున్నూ మట్టిని విసరినప్పుడు రెండో భాగమున్నూ పాట! ఊపిరి తిరగవద్దామరి ?

ఏయూరు, భామా
గుంటూరు. సామి
ఏమిటీ; పేరు
పేరుగు; న్నమ్మ

—ఈ పాటలో కూడా అదేలయ. ఒక పాదము పూర్తి అయ్యే వరకు రెండు పారల మన్ను పోగవు తుంది.

---

## ౨౪ పాట పదం

వచ్చె వచ్చె వానజల్లు జాలమదియేల
గుచ్చుకొనె రేగుముల్లు జాలమదియేల
చక్కగొట్టే చిన్నవాడా జాలమదియేల
చక్కవిరిగి చంపదగిలే జాలమదియేల
వచ్చె వచ్చె వానజల్లు జాలమదియేల
గుచ్చుకొనె రేగుముల్లు జాలమదియేల

చక్క విరిగి చెంపదగులుటలూ, ముల్లు గుచ్చు కొనుటలూ ఈ పాటలలో తరుచు వినబడుతాయి. ముల్లు గుచ్చుకొనుట పరిపాటియే. చెక్కలు ఎగురుట కూడా సక్రమ్ము చెంపదగులుట వింత.

---

# ౨౫ బరువులు లాగే పాట

—చిన్న చిన్న పనులలో పాటలోని స్వర ప్రవాహమున్నూ లయయున్నూ పనివాళ్ల దృష్టిని మార్చి పని కష్టమును మరుపు పరచగలవు. పెద్ద పెద్ద బరువులను తోయునప్పుడు పాటకులలోని తోడుకావాలె. కూలి తల్లి కోరే కామమే కదా సాహిత్య జనానికి సహాయకము? శ్రామికులను [illegible] ఆ పాట [illegible].

ఇంబయిలే జోరు లంగరు
అవుర, అవుర, మన్నోళ్లబ్బాయి ||ఇం||
నీకు బారులేదు । జోగులేదు ,,
నీకు రోసంలేదు । [illegible]సంలేదు ,,
నా! చల్ల నీళ్లు । మల్లి మొగ్గ ,,
నా ఉడుకు నీళ్లు । ఉల్లి పువ్వు ,,
కడవమీద । కడవబెట్టి ,,
కాకినాడ । రేవు కెళితే ,,
కాకినాడ । కలకటేరు ,,
కడవదింపి । కౌగలించె ,,
బిందిమీద । బిందిపెట్టి ,,
భీముడు పట్నం । రేవు కెళితే ,,
భీముడు పట్నం । కలకటేరు ,,
బింది దింపి । ప్రియములాడె ,,
ముంతమీద । ముంతబెట్టి ,,
కళింగ పట్నం । రేవు కెళితే ,,
కళింగ పట్నం । కలకటేరు ,,
ముంత దింపి । ముద్దులాడె ,,
ఎవరో? ఎవరో? మన్నోళ్లబ్బ ,,

## ౨౬. ఓ చిన్నదాన

"జంపైలే జోరుబంగరు" అన్నదితుమ్మెదా, వెన్నెలా, సునాసారి సన్నమ్మవంటి పాదాంత పదావళే (పల్లవి కాదు). ఈ పాదాంత పదావళితో ఎన్నిపాటలైనా వినబడుతాయి. జంపైలే జోరుబంగరు "కొండామీద కొక్కిరెట్ట" అన్న ఇంకొకపాట పూర్తిగా దొరికినది కాదు. కూలివారంపరూ "జంపైలే జోరుబంగరు" అని కలిసిపాడుతారు. కల్పనాకారు డొకడు పాటలు అల్లుతాడు. ఈ అల్లిక సాగినదానిబట్టి వారప్పుడప్పుడు గొల్లుమంటుంటారు కూడా.

—గోదావరి జిల్లా నాట్యసంఘాలలోదే కూలీలపాట ప్రచారంలో ఉంది. లిపిలో పాటకొక అడుగు వేస్తుంది.

ఓచిన్నదానా విడువనె చెంగు
ఓచిన్నదానా వదలనెకొంగు
బందారు చిన్నదాన బాజాబందూలదాన
బాజాబందూలమీద మోజేలలేదే ॥ ఓచిన్నదాన ॥
గుంటూరు చిన్నదాన గుళ్ళాపేరులదాన
గుళ్ళాపేరులమీద కళ్ళాపోలేదే ॥ ఓచిన్నదాన ॥
కాకినాడ చిన్నదాన కాసూల్ కంజేలదాన
కాసూల్ కంజేలమీద మనసేలలేదే ॥ ఓచిన్నదాన ॥
అర్ధారూపాయిపెట్టి అద్దాల రయికకొంటె
అద్దాలరయికమీద బుద్ధేలలేదే ॥ ఓచిన్నదాన ॥
నల్లానల్లానిదాన నడుమూ సన్నానిదాన
తళుకూ సేపలమల్లె కులుకూసూపులదాన ॥ ఓచిన్నదాన ॥
నిన్నుసూసీ మనసు నిలవకున్నాదోలె ॥ ఓచిన్నదాన ॥

ఈ పాటలోని నిగ్గులూ, యతి ప్రాసలూన్నూ బృందగానమున్నూ దారినిపోయే బాటసారుల చెంపదెబ్బనో పట్టి అదిరించగలవు. అలరించనూగూడ. పాడుకుంటూ కోలాటాలాడే జట్లు వేషశక్తికే సుందరసామగ్రియే. కనుక నే కవికొండల వెంకటరావుగారు కూలియన్నల (ఈ) పిలుపుకమును ఒక ఖండకావ్యములో ఇమిడ్చినారు.

# ౨౭ జాజారమ్మ తోట

—లయబద్ధములైన పనులకు లయబద్ధమైన పాటలతో మైత్రి చక్కగా కుదురును. ఈపాట 'కిటతక కిటతక' అన్న ఎనిమిది అక్షరాల ఆవృతాలు నాలుగేసి చేరి ఏర్పడిన పాదాలది. మొక్కలనుగానీ, నీటికుండలనుగానీ, వరుసగా నిల్చి ఒకరినుంచి ఇంకొకరికి అందించుకునే జట్లు ఈపాట పాడుతారు. మొదటి ఆవృతము కుండనందుకోటానికీ తరవాతిది కుండను పక్కవారికి అందించటానికీ ఊత అవుతుంది.

నాటేరమ్మా నాటేరు, ఏమీ మొక్క నాటేరు
జాజారమ్మా పూలతోటలో, జాజీ మొక్కనాటేరు
సాగేనమ్మా సాగేను, ఏమి తీగ సాగేను
జాజారమ్మా పూలతోటలో, సన్నాజాజీ సాగేను
యేసేనమ్మా యేసేను యేమిసిగురు యేసేను
జాజారమ్మా తోటలోను చేమంతులు సిగురేసేను
తొడిగేనమ్మా తొడిగేను ఏమిమొగ్గలు తొడిగేను
జాజారమ్మా తోటలోను రోజామొగ్గలు తొడిగేను
విచ్చేనమ్మా విచ్చేను ఏమిపూలు విచ్చేను
జాజారమ్మా పూలతోటలో సంపెంగలూ విచ్చేను ॥

పూలతోట పనిలోనేకాదు ఇటికెలు అందించుకొంటూ కట్టువేసేటప్పుడుకూడా ఈపాట పాడటము కద్దు.

# ౨౮ ఎయ్‌రా సిన్నో డెయ్‌రా

— ఇలాంటిదే [illegible]. [illegible] గుట్టు[illegible] [illegible]. [illegible] [illegible] [illegible] ఆశ్వతాలవే. కాని రెండు [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible].

ఎయ్‌రా సిన్నోడెయ్‌రా
ఎయ్‌రా జోరుగెయ్‌రా
దిక్కులుచూడక పక్కలొంచి
ముక్కువతో పనిచెయ్‌రా
ఎయ్‌రా సిన్నోడెయ్‌రా
ఇంటపుట్టిన ముద్దుల్లాగు
మొద్దుకింద వుండకుర
ఎయ్‌రా నీజోరుగాల ॥ ఎయ్‌రా ॥

# ౩౦ గడ్డిపాట

— పై పూనాల 'ఏమిటాకమ్మ', మాతెలుసు 'గడ్డిపాట'! ఈ రెండు పాటలు మోసుకొచ్చేది పంట, సర్వవ్యాప్తి అయిన పెద్దపంట, గడ్డిపంటలయే. నాటెవరు పక్షిమానము గమనించండి.

కడుపు చల్లనితల్లి
గడ్డిమాతల్లి
పిడికిటికి రావమ్మ
కొడవటికి రావే
గడ్డికూడె తింటూ
గడ్డిలోనే ఉంటూ
గడ్డిలో ప్రాణమొదిలి
కైలాసం సూత్తాము

# ౩౧ విసురురాతి పదములు - ౧

—విసురురాతి పదములని పశ్చిమాంధ్ర సీమలో చాలా పదములున్నవి. విసురురాతికి శృతితోనే గాని తాళముతో సంబంధము లేదు. కనుక ఈ పాటలలో తాళపు బిగుతువుండదు. ఊహలూ భావాలూమాత్రమే పొందుగ పెంపొందించి పట్టుకుంటాయి. కవనము కనబడుతుంది కోటిలో ముఖ్యంగా, మచ్చుకు నాలుగు పాటలు.

ఆదివారమునాడు అమావాస్యనాడు
అన్నయింటికి నేను గిన్నె నడుగబోతె
మావదిన శాంభవి లేదుపొమ్మనెను
మాయన్న మంచివాడు మళ్లిరమ్మనెను
చిన్నోనికి చీటంగి సిలుకు కుళ్ళాయి
బాలునికి పొట్లంగి పాలుపోసెగిన్నె
నాకునల్లచీర నెమలివన్నె రవికె
వడినిండ బియ్యము వళ్ళోకొబ్బరిగిన్నె
పసుపుకుంకుమయిచ్చి పంపెమాయన్న ||

# ౩౨ పిసుపరాతి పదము - ౨

తూరుపు వాకిళ్లకు దూలాలుగావు
పరమటి విండ్లకు పలకల్లుగావు
మాయింటి కోడండ్లకు రోకళ్లుగావు
ధనము రాసులిచ్చె తండ్రి రామయ్య
నీవైన చెప్పరాద ఆమానిపేరు
అమ్మరో నీకింత వినవేడుకైతె
మాడల్లా హార్యేటి మరుదుల్ల నడుగు
మాడల్లా హార్యేటి మరిది సుబ్బయ్య
నీవైన చెప్పరాద ఆమాని పేరు
అమ్మరో నీకింత వినవేడుకైతె
మైసాక్షి పక్షుల్ల మానుల్ల నడుగు
అమ్మారో నీకింత వినవేడుకైతె
బారాసావిటి మీది బావల్ల నడుగు
అమ్మారో నీకింత వినవేడుకైతె
కొలువు సావిడి మీది కొడుకుల్ల నడుగు
అమ్మారో నీకింత వినవేడుకైతె
నేలాన పండిన పల్లేరు చెట్టు

## ౨౩ విసురురాతి పదము - ౩

నల్లకొండల నడుమ వుతికె సాకాలి
మాయన్న ఏసిన దట్టి పేరేమె?
చింతకుంటనూలమ్మ శిరువెళ్ల తొగకు
నంద్యాల నల్లంచు లంజెపేటంచు
కందనోలు కరకంచు కంది బేడంచు
ఉతకరా చాకాలి వుల్లిపువ్వాలె
మడసారా సాకాలి మల్లెమొగ్గాలె
ఇచ్చిరా సాకాలి అన్నవాడలకి
ఇచ్చేను వొచ్చేను ఇల్లునే నెరుగ
గచ్చూలతో కట్టిన గాజు స్తంభాలు
సున్నమ్ము పూసిన సుకటి మిద్దిళ్లు
వేపమాని యెదురిల్లు ఎద్దూల మిద్దె



# ౩౪ విసురురాతి పదము - ౪

సకియయిల్లుజొచ్చి యెల్లజాలడె
సక్కన్నివాడమ్మ సారంగధరుడు
ఇరుగుపొరుగమ్మలార ఇతనిపొమ్మనగ
ఇరుగోరిమాటలు వినవచ్చిరేను
పొరుగోరిమాటలు వినవచ్చిరేను
చిలుకనీళ్లుతోడ జలకమాడేను
హంసఅన్నములొండె ఆరగించేను
వెలదీమంచములేదా వెన్నెలబైట
పడతిపానుపులెయ్యి పవ్వళించేను
ఆకుతేవె పోకతేవె అడకత్త్రి తేవె
చూడసున్నపుకాయ చుట్టియ్యమడుపు
సన్నంగచుట్టీయె సగముకొరికీయె
యెంగిలెంగిలిశివుడ యెగ్గుపట్టేవు
మనకేమియెంగిలీ పుణ్యపురుషులకు
విసినెకర్రలతోను విసిరె పికజాము
ఇసిరిసిరి ఆకాంత స్తంభానికొరిగె
కాంతకీకన్నీళ్లు కాల్వలైపారె
వానకురవలేదీ వరదెక్కడిది
అమ్మరో మనయింట్లో వొరువలెక్కడివె
నువుపోయి పరసింట్లో పండుంటివి కొడక
ఆడవారిశోకంబు అటువంటిదప్ప

వీని నడకలు ద్విపద నడకల్లాగ కనబడతవి. కాని వీటిలో ద్విపదప్రాసనియమము కనబడదు. ఇవి నాలుగేసి కిటుకకిటు ఆవృత్తాల పాదాలపాటలు. పాడేవారు పాదానికి ఇరవైమాత్రలు పట్టేతని కిట్టించేస్తారు.

# 30 కదురు

— ఈ కదురుపాట పల్లెలవారి ఆర్థికజీవనానికి చక్కనిఅద్దము. స్త్రీయొక్క ఆర్థిక పారతంత్ర్యమే మగవాని, జులుమునకు మద్దత్తు. కదురువల్లనేగదా ఆనాటి జీవనము ?

వడుకువడుకూ కదురు వడకవేకదురా
పిల్లల్లపుట్టింత యెల్లుండినంత
ఏకేకుఒకబారె నోల్లుండినంత
నాయేకు లైపోయె నాకేమెచింత
యేకుల్లయెల్లక్క పత్తిపుల్లక్క
రాట్నాలరామక్క రావెపోదాము ...వడుకు
కదురునల్లంగుంటె కదిలింతు గోగుక్కాడ
మగడెందుకే తగని మగడెందుకే

# ౩౬ రాట్నము

— దంపుళ్ల పాటవరసలో తరువోజల్లాగ వినబడే ఈపాటలన్నీ లోకవృత్తానికి దర్పణాలే. ఊహాలూ ఉద్దేశాలూ భావాలూ అల్లుకొని వుంటాయి వీట్లో. కవ్వమాడనియిల్లు కదురు తిప్పనికొంప కానరాని ఆరోజుల కమ్మనైన సంతుష్టిని ఈపాటలు చక్కగా గుంభిస్తాయి

అందచందములేని ఆడకూతురికి
అందమేరుపరుచు ఆపత్తిచెట్టు
పాడిపంటలున్న బంగారమిచ్చు
పైడి పత్తిని పెంచ బంగారు హెచ్చు
పాలు పెరుగులున్న పాపల కొలుకు
పత్తి నూలు దీయ పాతల కొలుకు
కవ్వమాడని యిల్లు కదురు తిప్పని కొంప
మగ్గము లేనూరు మరి గానరాదు
రాట్నాల మోతమ్మ కవ్వాలా మోత
కనకగిరి గొల్లోరి కవ్వాలమోత
ఏకుల్ల రాట్నము కాళ్ల సంకెళ్లు
కలవారి అల్లుడి కాళ్ల సంకెళ్లు
ఏకేకు ఒక బార ఎల్లుండి సంత
నాయేకులయిపోయె నాకేమి చింత
పుంజమ్మ నూలుకు పోగు లెక్క
కొండ మీద పొద్దుంది కొట్టబోకక్క
చేసి వారొస్తారు చెప్పబోకత్త

తక్కువైన పోగును భక్తి చేయడానికి చేనేత పత్తిని తయారుచేసే పాటలు :

# ౩౨ కవ్వపుపాట

— ఈ కవ్వపు పాట కిటుకకు కిటుకకు అని నాలుగక్షరాల ఆవృత్తాలతో నడుస్తూ కోలాటాని కనుకూలంగా ఉన్నది. కోలాటపు పాటే అన్నా నమ్మవచ్చును.

అన్నా బిందేటి పాలు – కిన్నెరల మోత
అమ్మా చేసేదీ చల్లోయీ
అమ్మా చేసేదీ చల్లా – కవ్వాల మోత
రాగిదీ కవ్వామోయీ
రాగిదీ కవ్వాము – రవ్వాడే వెన్న
చింతాదీ కవ్వామోయీ
చింతాదీ కవ్వాము – చిల్లాడె వెన్న
దంతేదీ కవ్వామోయీ
దంతేదీ కవ్వామూ – ధ్వనులెల్ల చల్ల
ఉక్కాదీ కవ్వామోయీ
ఉక్కాదీ కవ్వాము ఊగోచు వెన్న
రేపల్లెవాడలోయీ
రేపల్లి వాడల చల్లమ్మ చల్ల

---

వేయించు అన్నయ్య వెండిపొన్నుల్లు
సువ్వని నేనొక్క పోటేసితేనూ
చుక్కలు పిక్కటిల్లు సూరన్నకదలు
అన్నని నేనొక్క పోటేసితేనూ
ఆకసమ్మూ కదలు ఆరాజుకదలు

౨

ముగ్గురన్నలతోడ నేబుట్టినాను
నానడుము మువ్వంచు చీరగోరింది
నలుగురన్నలతోడ నేబుట్టినాను
నానడుము నల్లంచు చీరగోరింది
అయిదుగురన్నలతోడ నేబుట్టినాను
నావాళ్ళు అద్దాల రవికగోరింది

౩

కోడలా కోడలా కొడుకుపెళ్ళామా
పచ్చిపాలమీది మీగడయేదీ
వేడిపాలమీది వెన్నలుయేవి?
నూనెముంతలమీన నురుగులుయేవి?
అత్తలో ఓ అత్త ఆరళ్ళ అత్త
పచ్చిపాలమీద మీగడుంటుందా
వేడిపాలమీద వెన్నలుంటాయా
నూనెముంతలమీద నురగలుంటాయా

ఇరుగుపొరుగులార ఓ చెలియలార
అత్తగారారళ్లు చిత్తగించండి
పెత్తనం లాగేస్తె పేచీలుపోను.

౪

కారాలలో కెల్ల రెండుకారాలు
ఉప్పుకారమొకటి ఉపకారమొకటి
వాసాలలో కెల్ల రెండువాసాలు
రాణివాసమొకటి విశ్వాసమొకటి
కుంటలలో కెల్ల రెండుకుంటల్లు
వడ్లకుంటా ఒకటి వైకుంఠమొకటి.

౫

ఆడదాన్ని నేను అయిపుడితిగాని
గండ్రగొడ్డలిక్రింద కొమ్మనైనజాలు
గొడ్రాలు బ్రతుకేల కోటిధనమేల
స్వారాజ్యమిచ్చినా సవతిపోరేల
చూడకా ఆడేరు చూచి ఆడేరు
కానకా ఆడేరు కల్లలీ ప్రజలు
పాటలుపాడితే పలవలంటారు
పాడకుంటే జనులు మూగదంటారు.

## ఊ

పాపమ్ము చేసుకుని బావిలోపడితే
పై మురికియేగాని పాపాలుపోవు
చేటుకాలమట్ర శంకగుడ నీకు
ఆలిమీదిపెండ్లి సొట్లాడినావు ?
ఊరిముందరచేను వేయబోకన్న
ఊళ్లోను వియ్యమ్ము చెయ్యబోకన్న
ఊరిముందుచేను కాకుల్లపాలు
ఊళ్లోనవియ్యమ్ము కయ్యాలపాలు
చేనుమంచీదని చెప్పబోకన్న
చెరుకన్నరాజనం పండిన్నదాక
ఆలిమంచీదనీ అనబోకురన్న
అదివచ్చిమనలోన అణిగిన్నదాక
అత్తింటి కోడలవు కావుగావున్నె
ఆజ్ఞసిగ్గులునీకు లేవుగావున్నె
వీపునిండా కొంగేదె ఇరువరసలేవె
మడమతిరగ బట్టేదె ? మాటవాసేదె ?

# ౩౯ రాసగుమ్మడి

— పని ఆయాసాన్ని తగ్గించుకోటానికి పాడిన పాటలు ఆ పనిని గురించిన ఊహాల్నే కీర్తించ నక్కరలేదు. అన్యాపదేశపు టూపలూ, ఎత్తిపొడుపులూ, ఆశ్చర్యాలూ, ఏవైనా వుండవచ్చు ఈపాటల్లో. అందుకే ఒకొక్కచోట వీటి భావార్థాన్ని తెలుసుకోవటము కష్టము. ఈ రెండు పాటల్నీ చూడండి.

గుమ్మా! గుమ్మన్నలారా! గుమ్మన్నలారో! నారాసగుమ్మడీ
తూరుపునున్నాది । తారుపుగుల్లో ! ॥నా॥
తారుపు గుల్లాకు । తవ్వాంతకొప్పో ! ,,
తవ్వాంత కొప్పాకి । గుప్పుడేసిపూలో ! ,,
గుప్పుడేసి పూలకి । తాకట్టు నరుకో ! ,,
తాకట్టు నరుకీకి । తాగుబోతు మొగుడో ! ,,
తాగుబోతు మొగుడికి । తాళింపుకూడో ! ,,
తాళింపుకూడాకు । తాటికాయపులుసో ! ,,

—

# ౪౦ చెంచువారు

చెంచు వారిళ్లలో చెడ్డకొలవనివారు
చేరుటమ్మాలచేతనూ
వీపునాయిమరిల్లు విల్లుటంబులుచేత
యిల్లు వెళ్లని చెంచులూ
పొద్దుపోయె యింటికి పోవాలెగూటికీ
దోవదొలుగూ ఓగులూ
పొద్దుబోతే కనక బద్దికురులున్నాయి
వెతకవే వెదురు బియ్యము
వెదురు బియ్యపు కూడు మదన చక్కెరతోడ
మదము లేకలబలకవు
ముదముదగమానుముందరది నెల్లీవనము
ముందరది నెల్లివనమూ
మెట్టికాళ్లాదాన మెట్టించి నడచేవు
కాలి ముల్లిరగదంటే
అరికాళ్లా వున్నాది అరవై ఆరు ముళ్లు
ఆడదీ జాణతనమూ
కూచ్చొనీ ఆముల్లు కుదురుగా తీయబోతే
కుదరనీయరు చెంచులూ
పండుకోనీ ముల్లు పాటిగా తీయబోతే
పండనీయరు చెంచులూ
చెంచువారిళ్లలో చెడ్డకొలవనివారు
చేరుటమ్మాల చేతనూ

# ౪౧ కాకరపువ్వొప్పునే

౧. పల్లవి : కాకర పువ్వొప్పునే! గౌరమ్మ । కాకర పండొప్పునే ।గౌ॥

మిత్రం – కాకర, పువుమీద । వాలిన చిలుకలు
వసంత రేకులు, నైకో గబ్బలు
నైకో మేడలు, చందమామ నీడలు
సవరపు దండలు ।
ఆగడియలో శ్రీగడియలు—
దంచిన పాలు । ధరణికి లొంగవు ।
దానత్తబోసిన । పట్టెల్లు
కో; కో; తడపలు । రాముడయ్యలు ।
గంటసిరి మువ్వలు । గౌరమ్మా! నీసుతుడేడే?
వాడిన పువ్వులు, వడిలో బోసుక
వాడలు నెలికిన । లేడమ్మా!
సరి, మేడలు నెలికిన । లేడమ్మా.

౨. చిక్కుడు పువ్వొప్పునే? గౌరమ్మ । చిక్కుడు కాయొప్పునే

మిత్రం – చిక్కుడు పువుమీద । వాలిన చిలుకలు—

[పై మాదిరిగా – మిగిలినది పాడవలయును]

3. బీరయ్య పువ్వొప్పునే? గౌరమ్మ బీరయ్య పిందొప్పునే

మిత్రం – బీరయ్య పువుమీద । వాలిన చిలుకలు—

[పై మాదిరిగా – మిగిలినది పాడవలయును]

# ౪౨ గొబ్బిపాట

పిల్లలు ఆటలాడుతూ పాడే పాటలు చాలా వున్నవి. వాటిని పల్లెపదాలనటం కంటె బాల గేయాలనటం మెరుగు. వారి ఆటల పాటలలో లయ, యతిప్రాసలూ తప్ప మానవుల ఊహాలున్నూ ఉద్దేశాలున్నూ ఉండవు. (ఇంగ్లీషులో బాలగేయాలను ప్రాసక్రీడలనే అన్నారుగాని పాటలనలేదు.) ఈ బాల్యావస్థ దాటిన ఆటలపాటలు గొబ్బి పాటలేనని పిస్తుంది.

గొబ్బి కాటమరాజు కథలో మొదట కానవస్తుంది. క్రీ. శ. 1424 నుండి 1503 వరకూ జీవించిన అన్నమయ్యగారి సంకీర్తనములలోని "కొలని దోపరికి గొబ్బిళ్లో యదు కులము సామికిని గొబ్బిళ్లో" అన్న కీర్తననుబట్టి 'గొబ్బిళ్లు' అంటే నుతులు, పూజలు, అన్న అర్థము వస్తుంది. ఈ శతాబ్దారంభములో 'స్త్రీలపాటలు' అచ్చువేసి ఈ వాఙ్మయాన్ని ఉద్ధరించిన నందిరాజు చలపతిరావుగారు దశమస్కంధ పూర్వభాగము, ప్రశ్నోత్తర గొబ్బి పాట, చూడికుడుత్తాళ్ మీది గొబ్బి పాట, అని మూడు పాటలు అచ్చువేసినారు. ఈ పాటలలో గొబ్బియళ్లో, గొబ్బి, అన్న మాటలు నుతులు అన్న అర్థముతోనే కనబడుతున్నవి. "గొబ్బిపాట" అన్నమాట "గొబ్బిళ్ల పాటల వరుసలోని పాట" అన్న అర్థముతో ఉన్నది. కనుక గొబ్బి పాటలు ఒక వరుసగల పాటలున్నూ 'గొబ్బియళ్లో' అన్న మాటలు తుమ్మెదా, వెన్నెలా వంటి పాదాంత పదములూ నన్నమాట. గొబ్బి పాటల వస్తువు సామాన్యముగా పౌరాణికముగానే వుంటుంది. మచ్చుకు ఒక్కటి.

గంగమ్మ గౌరమ్మ అప్ప సెల్లెండ్రూ గొబ్బియళ్లో గొబ్బియళ్లో
ఒక తల్లి బిడ్డలుకు వైరమూ లేదు ,, ,,
మంచి మంచి పూలేరి ఒకరాసిపోసిరి ,, ,,
కానరాని కలువలేరి ఒకరాసిపోసిరి ,, ,,
ఏడు మూర లింటిలో ఏడొక్కతూము ,, ,,

ఏడొక్క తూమేసి ఎల్లా కొలిపించె గొబ్బియళ్లో గొబ్బియళ్లో
పొగిడి ఒక తూమేసి పారాకొలిపించె ,, ,,
గంపెడు తీసేసి గంగాకెత్తండీ ,, ,,
మంచి మంచి పూలేరి మామయ్య కంపే ,, ,,
కానరాని పూలేరి గౌరమ్మ కంపె ,, ,,
అక్కనూ చెల్లినీ ఒక్కరికిచ్చె ,, ,,

---

# ౪౩ చందమామ కోపు

— మన జాతీయజీవనంలో యువకులకునూ తరుణవయస్కులకునూ ఆటలు లేవు. కోలాట మొక్కటే కాబోలు ఆటఅనటానికి వీలయినది. దీనిలో వర్ణచలనమూ వేషసామరస్యమూ, గమన సామరస్యమూ, మువ్వల మ్రోత కోలల లయ, రాగసరళి, కంఠమేళ, కథాసౌందర్యమూ ఒక్కుమ్మడిగా ఏకమయి అలరిస్తవి. జట్టు నాయకుడు ఒక చరణము పాడితే వర్తులాకారంలో ఉన్న జట్టువారు ఆచరణాన్ని తిరిగి పాడతారు. అందరూ చిన్న చిన్న కట్టెలతో లయను సూచిస్తూనే పాడతారు. నాయకుడు నడిపే కథలో ఉత్సాహపు పట్టువచ్చినప్పుడు, ముందుకూ వెనుకకూ అడుగులు వేయటమూ, పక్కవానిని చుట్టిపోయి పైవానితో కోలకొట్టి తాళము నిలపటమూ, ఆటగాండ్రు చాలమంది చేరికితే లోకక్ష్య నెలికక్ష్య సవ్యముగానూ అపసవ్యముగానూ తిరగటమూ కనబడతాయి.

కోలాటపు పాటలు సామాన్యముగా చతురశ్రగతిలో కిటతక కిటతక అనో, త్రిశ్రగతిలో తకిట తకిట అనో నడుస్తవి. వీటిని కోపులంటారు. మొదటిది విఘ్నేశ్వర కోపు. "శివశివమూర్తివి గణనాథ, నీవు, శివుని కుమారుడవు గణనాథ" అని ప్రారంభిస్తుంది. సరసకోపు అనే "గొల్లనారి వాడలకు కృష్ణమూరితీ, నీవు, ఏమిపనికొచ్చినావు కృష్ణమూరితీ" అన్నపాట అన్నమయ్యగారి కాలానికే ఉన్నట్లు దీన్ని అనుసరించిన అతని సంకీర్తనలు పెక్కులు సాక్ష్యమిస్తవి . . . కోలాట కీర్తనలు దేశి సారస్వతములోని ఒక ప్రత్యేక అధ్యాయము. పురాణగాథా సన్నివేశాలూ, భక్తుల తీర్థయాత్రలూ, గోవాళ్ల సంవాదాలూ, వేదాంత తత్త్వాలూ, బ్రతుకు బాటలూ, గురుప్రశంసలూ, మోహప్రలాపాలూ, అన్నీ వుంటవి ఈ పాటలలో. తెలుగులో ప్రాస్తావిక పద్యమంజరులు (Poems) లేవు; ఈ కోపులు ఆ సీట్లలో చక్కగా అమిరి పోతవి . . . మనము కీర్తన అనుకునే "రామలాలీ మేఘశ్యామలాలీ, తామరసనయన దశరథతనయాలాలీ" అన్నది లాలికోపు. 'తెల్లవారవచ్చె తొలికోడి కూసెను నల్లాని నాసామిలేరా' అన్నది మేలుకొలుపు కోపు. 'రామచంద్రాయ జనక రాజజా మనోహరాయ మామకాభీష్టదాయ మహిత మంగళం' అన్నది మంగళహారతి కోపు. పూర్వకాలపు పాటలలో ఈ కోపులు కలిసిపోయి ఉంటవి. దరువు, కోపు,

పదము కీర్తన, జావళీ—వీటి పుట్టుపూర్వ సృష్టి కనిపెట్టటము అందమైన పని. అది ఇంకా జరగవలసియున్నది.

ఇక్కడ ఉదహరించిన శ్లోకాలు నేటికేపాటు తెలుగు నాట వినిపించే పాటలే.

చందమామ చందమామ చందమామా
అంద చందాల ముద్దు చందమామా
పాలకడలి తరగలందు చందమామా
బాలుడవై బుట్టినావు చందమామా
పాలాక్షు శిరమునందు చందమామా
బాల చంద్రరేఖ వీవు చందమామా ...చంద
పాలుత్రాగు పిల్లలాకు చందమామా
పాలవిల్లి బంతి వీవు చందమామా
చల్లగ మాతోడు రావా చందమామా
చందమామ చందమామ చందమామా
అంద చందాల ముద్దు చందమామా

ఈ శ్లోకాలలో పాండిత్యమూ భాషా సంస్కారమూ కనబడతవి. వాయకుడు చదువుకున్నవాడే అవుతాడు సామాన్యంగా. అంటే అక్షరాల పండితుడని కాదు, శ్రుత పండితుడనుట.

---

పు :— సన్న బియ్యము తెచ్చి । చావట్లో ఉంచాను,
వండైన వండగలవా ? ఓలె చెంచూ !
వండైన చూపగలవా ? ॥స॥

స్త్రీ :— వెదురు బియ్యము తిను । మా చెంచు వారికి
సన్నా బియ్యములేలరా ! మగవాడ !
సన్నబియ్యములెందుకు ॥వె॥

పు :— సన్న చీరెలు తెచ్చి । దణ్ణాన వేసాను
కట్టైన కట్టగలవా ? ఒల చెంచూ
కట్టైన చూపగలవా ? ॥స॥

స్త్రీ :— పారుటాకులుగట్టు । మా చెంచు వారికి
సన్న చీరెలు యేలర । మగవాడో
సన్న చీరెలేలరా ॥పా॥

వెర్రి నరసింహస్వామి. తెలుసునాటి చెంచు బిడ్డను పలచు రెుంతో యాశ పడినాడు ! అందుకే పాడుకోగలిగినారు "అందమైన ఆకుపడుచులు చెంచు వారికెందుకు ? పెంచి పెంచి ఓ బళ్లెకు డెత్తక పొయ్యేటందుకు" అని చెంచువారు.

## ౨౬. జారిన కొప్పు

—ఇది వినండి తెలంగాణ కోలాటపు పాట.

గట్టుకు బోయినేను — కట్టెలు తెమ్మంటె
కొప్పునున్నాపూలు — ఎక్కడివె భామా ? నీ
కొప్పునున్నాపూలు — ఎక్కడివె భామా ?
అత్తేరిపూలు — ఎక్కడివె భామా
ధూత్తేరిపూలు — ఎక్కడివె భామా

గాలి ధూళివచ్చి — గంపంత మబ్బొచ్చి
కొమ్మ ఊగి కొప్పు — నిండింది మగడా
కొమ్మ ఊగి కొప్పు — నిండింది మగడా
నాతోడు రంకాడలేదు — అబ్బతోడు రంకాడలేదు
నీతోడు రంకాడలేదు — అమ్మతోడు రంకాడలేదు

అన్నీ సరేకాని — ఇన్నీ సరేకాని
కొంగు నిండా దుమ్ము — ఎక్కడిదె భామా
కొంగు నిండా దుమ్ము — ఎక్కడిదె భామా
అత్తేరి దుమ్ము — ఎక్కడిదె భామా
ధూత్తేరి దుమ్ము — ఎక్కడిదె భామా

పాటేలు ఇంటికి — పాలకని పోతేను
కట్టె కోడె కాలు — దువ్వింది మగడా

కట్టె కోడె కాలు – దువ్వింది మగడా
నాతోడు రంకాడలేదు – అబ్బతోడు రంకాడలేదు
నీతోడు రంకాడలేదు – అమ్మతోడు రంకాడలేదు

అన్నీ సరేకాని – ఇన్నీ సరేకాని
చెంపనున్న కాట్లు – ఎక్కడివె భామా ? నీ
చెంపనున్న కాట్లు – ఎక్కడివె భామా
ఆత్రేరి కాట్లు – ఎక్కడివె భామా
ధూత్రేరి కాట్లు – ఎక్కడివె భామా

కోమటోరింటికి – కొబ్బరికి బోతేను
తక్కెట్లో గుండొచ్చి – తగిలింది మగడా
తక్కెట్లో గుండొచ్చి – తగిలింది మగడా
నాతోడు రంకాడలేదు – నీతోడు రంకాడలేదు
అమ్మతోడు రంకాడలేదు – అబ్బతోడు రంకాడలేదు.

అన్నీ సరేకాని – ఇన్నీ సరేకాని
మంచం క్రింది వాడు – ఎవ్వాడె భామా ? నీ
మంచం క్రింది వాడు – ఎవ్వాడె భామా
ఆత్రేరి వాడెవ్వాడె భామా
ధూత్రేరి వాడెవ్వాడె భామా

పక్కెయింటిలోనేటి పసుపుపిల్లోడు
పిల్లికి తలనొప్పి – నల్లికొచ్చిందు
పిల్లికి తలనొప్పి – నల్లికొచ్చిందు
నాతోడు రంకాడలేదు – నీతోడు రంకాడలేదు
అబ్బతోడు రంకాడలేదు – అమ్మతోడు రంకాడలేదు.

'కోపులు ముడిభావాలుకావు రచనలోనటానికి ఇది చక్కని ఉదాహరణము. కొమ్మమాగి కొప్పునిండుట వల్ల వచ్చే లేనిపోని రవ్వలు అన్ని పాటలలోనూ కనబడతవి. "ఏమే పిల్లా మదారి బూబూ కుంకుం పెరిగిందే, లమిడీ కుంకుం పెదిరిందే" అని అడిగితే "ఉడుకుడుకన్నం ఊపుకుతింటే, కుంకుం పెదిరిందే మామా" అన్న జవాబుల పాటకూడా ఈ కోవలోనిదే. నల్లిని చంపిన పాపన తలనొప్పికి మందని తెలంగాణమున వెల్లడే తక్కిన వారికేమో? తెలీదు.

## ౪౭ తేరుకోపు

— ఇది రత్నాల సీమ కోలాటపు పాట. తెలంగాణపు పాటలలోనూ రాయల సీమ పాటలలోనూ తెలుగు జిగి ఎక్కువేమో ? పరిశీలించండి అన్నలు.

వచ్చేనురా రంగ వచ్చేనురా
పెన్నోబుళేము తేరు వచ్చేనురా
గుడ్ల కోడి జంపుకోగుజ్జంగ వండుకొని
గుత్తిలోన తెల్లవార వచ్చేనురా
కారుకోడె జంపుకోని కమ్మంగ వండుకోని
కదిరిలోన తెల్లవార వచ్చేనురా
అత్తమామ గొలిచేటిగుత్త నరసింహునకు
వత్తిలేని దీపంబెట్టి వచ్చేనురా
నట్టింట నుండేటి నాచిన్న బాలునకు
నట్టావుపాలు బోసి వచ్చేనురా
పాలుబోసి పండ బెట్టి వచ్చేనురా
నీళ్లుబోసి నిద్ర రూపి వచ్చేనురా

## ౪౮. చెఱకుతోటకోపు

—ఇవి చిత్తూరు సీమవి. చెఱకు రైతుల పాట్లు చక్కగా చూపిస్తవి.

ఏశేస్తివి నరసన్న చెఱకుతోట
ఎందుకేస్తివి నరసన్న చెఱకుతోట
చుట్టు ముట్టు తోటల్ని చెఱకుతోట
చుట్టుకాని కొచ్చినాయి చెఱకుతోట
నరసన్న తోటలోన చెఱకుతోట
నక్కకొరక పచ్చిలేదు చెఱకుతోట
ఆయగాళ్ల కింతపోయె చెఱకుతోట
సాయగాళ్ల కింతపోయె చెఱకుతోట
అప్పులోళ్ల కింతపోయె చెఱకుతోట
అడిగినోళ్ల కింతపోయె చెఱకుతోట

'కిటతక కిటతక' అని చతురశ్రగతిలోనే నడుస్తవి ఇవి.

## ౪౯ — పై ఊ కు ప ం టి కో ష్ర

సైరా నాగానిగిల్లా, ఇట్ల నరకలోకమేలేటి
నా ముద్దుగానిగా
కొత్త కోటోల్లొచ్చి కొలతబెట్టించిరి
గుండ్లూరు వారొచ్చి గుర్తుబెట్టించిరి
బారాల వారొచ్చి సెఊకు నాటేసిరి ॥సైరా॥
బోడరెడ్డి పల్లెవారు బోడసాలుతీసిరి
అంగుతోట పల్లెవారు ఆకుసాలుతీసిరి
సుట్టుపట్టు వారొచ్చి సుట్టేసిపోయిరి ॥సైరా॥
గుడియాత్తం వారొచ్చి గూటలునాటిరి
వారప్పు కొండకుపోయి వాసాలుతెచ్చిరి
నీతలకు తగలకుండా దండాలుకట్టిరి ॥సైరా॥
గానుగింట్లో ఆసెరకు గెజ్జ వాగినట్లుంది
కరణంకాడ ఆసెరకు కంచు వాగినట్లుంది
పంట పంట సక్కెరాయె వాకుదప్పిన బెల్లమాయె
రాయల్ పేట వర్తకులు రంగులేదనిరి
చౌడేపల్లివారు సరకు బాగనిరి
పలమనేరువారు పైకమిచ్చిరి
ఓచ్చయ్యా చేతిలో పచ్చనోట్లు
నీచేత నాచేత పచ్చిపోకలు ॥సైరా॥

చివరకు మిగిలేవి పచ్చిపోకలు !

## ౩౦ జాజిరిపాట

— జాజిరిపాట చర్చరీ వృత్త పరిణామము. తెలుగునాటి జాతీయస్వరూపము - తమపాట - కూడా సంస్కృతపు ధ్రువాపదముల అవతారాలే. జాజిరిపాటలు పన్నెండి జిల్లాలలో కాక పోయినా కోలాట బృందగానాల కోలాహలంతో తెలంగాణాలో ఇంకా నిలిచివున్నాయి. మాదిరికి రెండు

అల్లోమల్లో రాముల మల్లో
రాయిగదిలె రామశిఖరమ్మై కదిలె
మున్నూటరువయి గుర్రాము కదిలె
గుర్రాన్ని గొట్టి గుట్టకుబెట్టి
గుర్రపుతోలు ఆర్నపుజోడు
జోడు గొంచాబోయి జోగయ్యకిస్తె
జోగయ్య రెండూ జొన్నగింజలిచ్చె
జొన్నగింజలు తీసుక ఏలేత్రింబోతె
ఏలేత్రంలో రెండు ఎల్లెడ్లు దొరికె
ఎల్లెడ్ల తీసుక వ్యవసాయంపెట్టి
వలపటి దాన్ని దాపట గట్టి
దాపటి దాన్ని వలపటగట్టి
ముత్యాల [illegible] తుంటిమీద మోపి
బంగారి పగ్గాము పన మీద మోపి
ఈడ్చికొడితే ఇరవైపుట్లు
అర్చికొడితే అరవైపుట్లు

# ౫౧ జాజిరిపాట

జాజిరి జాజిరి గాజుల పాప
జాజుల్ల గూచున్న సన్నపు చాప
చాప చుట్టారే సందారికోట
కోట కోటకు రెండు కొమ్మల జగ్గాల్
జగ్గాలు బట్టుక పల్లెకు పోతె
అప్పుడే నావొల్లు జల్లుమానె
జల్లు మన్నకాడ మల్లెల్లు రాలె
మల్లెల మాదేవి తోట్లో ఉన్నాది
గుబ్బాల్ల పడుచుకు గుత్తాపు రవికె
రవికె గాదురో రామాల మొగ్గ
మొగ్గగాదురో మోదుగునీడ
నీడ గాదురో నిమ్మల బావి
బావి గాదురో బసుమంతకూర
కూర గాదురో కుమ్మరి మేను
మేను గాదురో మేదరి ఇల్లు
ఇల్లు గాదురో ఈగల తెట్టె
తెట్టె గాదురో బియ్యాపు రొట్టె.

చాళుక్య సీమలోని 'కాళ్లా గజ్జా - కంకాళమ్మ' అన్నది నాగరిక పాతుపడ్డ జాజిరి పాటయొక్క కంకాళము. లయ మాత్రము నిలిచింది నేటికి.

# ౩౨ తలపాగా

— ఈ మూడుపాటలూ చిత్తూరు మండలానివి. వీటిగతికూడా చతురశ్రగతియే. ముందు పాదానికి ఉరకలువేస్తూ పాడటం గుర్తిస్తే వీటినికూడా కోలాటంపాటలే ననవలసి వస్తుంది

అలోమల్లో రాగూల మల్లు
రాగూలకేసినా రంగూపురిసాప
సాపాదిరుగోలె సౌకారుకోట
కోళ్లెన్ని కొమ్మాలెన్ని
కొమ్మాలసందూన మర్రియాకు
మర్రి మర్రికే జిల్లేడాకు
జిల్లేడాకూల జెల్లముండె
సీకూ దొరుకాక నక్కాకుదొరికె
అటుగుంటి ఇటుగుంటి జివ్వోడాకె
జివ్వోడికాపుల్ మరిమంచోళ్ళు
బతుకూమాని రెండూ మామిళ్ళిచ్చిరి
మామిళ్ళదర్మాన పూతాగూసె
పూతాదర్మాన కాతాగాసె
కాతాదర్మాన పనలేమక్కె
పనలాదర్మాన పైకాలొచ్చె
పైకాలదర్మాన పాగాలొచ్చె
పాగాజుట్టుకొని పల్లేకుపోతే
పల్లేకుక్కాలన్ని బవ్ బవ్ మనె
అప్పుడే నాకడుపు జల్లూమనె

---

## ౫౩ పరమాన్నం

భూమీకి తాళాలేస్త్రేరంగా
అల్లోభోగం దాడ్త్రేరంగా
భోగందానికి సవురం దొరికె
సవురం కొండూపోయీ అమ్మాకిచ్చె
అమ్మాబుడ్డెలు పాలుపోసె
పాలు కుండాపోయి పరవాన్నమొండె
మొగోన్కి పెట్టేరా మొర్రి చిప్పాలో
బిడ్డాకు పెట్టెరా బొడ్డూ గిన్నెలో
అది వెట్టూకొనె యెండీ గిన్నెలో
మొగోన్కి పోసెరా కప్పాల కడుగు
బిడ్డాకు పోసెరా రొయ్యాలా పులుసు
అది పోసె కొనెరా గంగావు నెయ్యి
మొగోన్ని కరచే మొద్దుల్లపాము
బిడ్డన్ని కరచే బెడ్డాల తేలు
దాన్ని కరచే కట్టకింది కాకి
మొగోన్ని వెట్టెరా మొద్దూల కింద
బిడ్డాని పెట్టె బెడ్డల కింద
దాన్ని పెట్టె కట్ట కింది లోన్లె.

## ౨౪ పడపడా పడపడా

మొండి పోతూవై మోటల బడితే
మాటలొచ్చెనో మల్లప్పా
మల్లప్పా అని మడుగు జల్లితే
శింగి గుట్టెనో శివలింగూ
శివలింగా అని చింతకుపోతే
గొడ్డాలి దూకె గోవిందూ
గోవిందా అని గోడ కరుకుతే
పెల్లాగూలె వోయీ పెరుమాళ్లూ
పెరుమాళ్ళూ అని పెండాకు పోతే
ఆవు దన్నెనో హనుమాన్లు
హనుమానూ అని అంగాడిక్కి పోతే
దొంగాలు దోసిరి దడదడా
దడదడా అని దొడ్లోకి పోతే
పోనూ పోకను దెబ్బల్
పడపడా పడపడా
పడపడా పడపడా

---

## ౨౫ ఏలకోపు-౧

— ఇవి రెండూ చిత్రమైనపాటలు. వీటిత్రిశ్రగతీ, పాదసంపూర్ణతా వస్తుసంకీర్ణతా రచనాప్రాగల్భ్యమూ వీటిని కోలాటపు పాటలలో చేర్చటానికి సాయపడ్డవి. వీటిలోని శృంగారమునుబట్టి వీటిని ఏలకోపులంటున్నాము.

వానేల గురిసెనో రాజో! నాస్వామి,
వరదరాజుల పువలవాన ।ఔను।
మళ్లి గురిసిన పువలవానో । నాస్వామి,
మగువ దగ్గిరపేటలోను ॥వా॥
చీరెల్ల చిత్తారునేతో! నాస్వామి,
ఒళ్లెల్ల జవ్వారిపూత ।ఔను।
యెల్లయెల్లను, దున్నువాడ ।చినవాడ!
యెల్లుండి నేవెళ్లిపోతా ॥వా॥
వెళ్లిపోయే చిన్నవాడ ।నాస్వామి।
వ్రేళ్లనిండా ఉంగరాలు ॥ఔను॥
ఉంగరాలు చెయ్యిచూస్తె ।నారాజ!
ఉండదయ్యా, ముండమనసు ॥వా॥
ముంగటేరు, దున్నువాడా! నాస్వామి;
ముత్యాల పోగులవాడ ।ఔను।
సాలుదప్పక దున్నుతావా ।చినవాడ।
దారిదప్పక నేనెవసా ॥వా॥

కావిడేసుక నువ్వురాకో ||చినవాడ||

కడవబట్టుక నేనెవస్తా ||ఔను||

నీటిమీద కొంగుపఱచి |నారాజ|

నిద్దురే నీకిచ్చిపోతా ||వా||

కొండమీఁద కొట్టుచేనో |చినవాడ|

కొట్టుబోతే రెడ్డిసాని |ఔను|

రెడ్డిసాని ఱొమ్ముమీద |నారాజ|

గోగుపువ్వే గొడుగునీడ ||వా||

---



## ౫౬. ఏలకోపు – ౨

పుట్టమీద పాలపిట్టోయి నాసామి
కొట్టబోతె తేలుకుట్టె అవునోయి
మంత్రపించే జాణలంటే నాసామి
మల్లెమొగ్గ పానుపేద్దు అవునోయి
నేలనేలనెల్లి కూరోయి నాసామి
పాలపాలబలుసు కూర అవునోయి
వాలుకొమ్మల సింతసిగురోయి నాసామి
వండిపెడితే వలపుతీరు అవునోయి
అరుగుమీద అరటిపండోయి నాసామి
అడగబోతె బహుసిగ్గోయి అవునోయి
పందుమీద ప్రేమలుంటే నాసామి
పంతగిస్తే పండురాదా అవునోయి
చక్కరాల గుట్టకాడ నాసామి
చెక్కగొట్టె చిన్నవాడ అవునోయి
చెక్కవచ్చి చెంపనాకె నాసామి
చెప్పరాని దుఃఖమొచ్చె అవునోయి
మంచినీల బావికాడ నాసామి
మందునూరే సిన్నవాడ అవునోయి
మందులేలా మాకులేలా నాసామి
మాటలాడితె నేనుదానా అవునోయి ॥

'ఉంగరాల చెయిచూసి, ఉండడేర ముండమనసు', 'ముందిడేరు దుస్నేనాడు', 'చెక్కవచ్చి చెంపనాకె,' నన్నవి రత్నాల తునకలు. చాలాపాటల్లో మెరుస్తవి. ఈరచయితలు పేరుకేపెట్టుకోరు. కాబట్టి కాపీరైటు బాధలేదు! ఎవరు సంగ్రహించినా ఆక్షేపణలేదు.

# ౨౩ కోలాటం పాట

జానపదుల హృదయము మహోన్నతమైనది. శౌర్యాన్ని అరమరి లేకుండా పూజిస్తుంది. అవగింజంత అన్యాయానికైనా సహించదు. పత్నిసుని వీరుడు కనబడినా కళ్లుమూసుకోదు; వాని కీర్తి, రాజసమూ, ఏదో గుణాన్ని ఎక్కడికక్కడే మెచ్చుకుంటుంది. హంతకుడినైనా నకే చిత్రవధ చేస్తే భరించలేదు. జాలిపాటలు పాడుకుంటుంది. లోకోపకారికి సాష్టాంగము పడుతుంది. తెలుగులో స్వాతంత్ర్య వీర గాథలు పెక్కులు కలవు. ఇక్కడ ఇచ్చినవి చిన్న రచనలు.

— మొదటిది 'కోలాటం పాట', ఓబులరెడ్డి కోట (ఖండగతిలో నడపటం వింత) పైపెత్తనము రాకుండా ఆత్మీకదిళాన్ని అర్పిన దాతని జెండా. తెలుగునాట నిట్టి అజ్ఞాత వీరులు ఊరున కొకరు. హండేవారు దోపిడ్ నడిపినప్పుడు మరుట్ల పాళెపు గొల్ల చిన్నమ్మ కొడుకు చిన్నమల్లేశ "కోటకొమ్ము లెక్కినాడు కోటకూత లేశినాడు, బుజం మింద బల్లెమిసిరి మొలక మీసం దిద్దినాడు." ఆవీర వంశములోని వాడే ఓబులురెడ్డి.

కోలు కోలన కోలు కోలన్నా కోలే
కోలు మాయకు బాలనరసింహాకోలే
గుట్టగురప్పకొండ గురిదప్పకుండా
పై దళ్ళమురాకుండ పడెరానీజండా
సైరాఓబులు రెడ్డి నెలవన్నె కాడా
నినుజూచి నాగుండె జలుజల్లు మనెరా ॥కోలు॥
నీకుప్రాలూ నీదుకత్తి కీప్రాలూ
నీచేతికీవన్నె బంగారురవలు
ఎరాఁదిగుత్తము వెండికళ్ళెముగ
దూకించెగుఱ్ఱాన్ని [redacted]మెన్నెల్ల కేక
బూడిదగుఱ్ఱము బుగడకళ్ళెముగా
బుగడకళ్యాణికి బొండుమల్లెలురా ॥కోలు॥

వీరపూజలో తెలుగుబిడ్డ ఎన్నడూ వెనుకాడలేదు, నీచుని తెగనాడుటలోనూ ఆలసింపలేదు.

# ౩౮. మల్లన్న పాట

ఓకోరి మల్లన్నా బొమ్మని పాటి మల్లన్నా
పాలోడ్లై పుట్టివిరా బొమ్మని పాటి మల్లన్నా
పగదార్లై పుట్టివిరా బొమ్మని పాటి మల్లన్నా
నీతండ్రి జావంగా నీతల్లి జావంగా
నాసేతు లేసిదిరా బొమ్మని పాటి మల్లన్నా
బండికి కట్టిండూ యల్పుటకాడు చంద్రగాడు
దుమ్మోరి పాడదిరా బొమ్మని పాటి మల్లన్నా
జోరు జోరు బాగుడల్లా కాసోడు కొట్టిన
కక్కూసపు రాళ్ళల్ల నీగోరి కట్టిరిరా
బొమ్మని పాటి మల్లన్నా
తాసిల్దార్ కాశేరికి తాల్కుదార్ బంగళాకు
నీ తజ్వీర్ దించిరిరా బొమ్మని పాటి మల్లన్నా

కక్కూసపు రాళ్లతో గోరి కట్టినారట మాయల మల్లన్నకు. అప్పటికిగాని వాని పాపానికి ప్రాయశ్చిత్తము జరుగదు !

# ౩౬ గోపిరెడ్డి

—గుత్తాల గోపిరెడ్డి చిన్నపరెడ్డి వలెనే చండ శాసనుడై యుంటాడు. బాధితులు నలుగురు హఠాత్తుగా చేల నడుమన పట్టి నరికినారట. పోతేపోయెను. చాలని వానికి ఏ గలరా ? గోపిరెడ్డి ఎటువంటి వాడు ? శేరు శేరు వెండి మురుగులతో, దువ్వి నిక్కిన మీసముతో కట్టప మీద పోతూవుంటె 'కదిరితేజు' సానివచ్చే !

ఓ గుత్తాల గోపిరెడ్డి
దాచేపల్లికి దానమైతి వా
శేరుశేరు ఎండి మురుగుల్ చేతులాకు బెట్టుకోని
కట్టవ మీద వస్తావుంటే కలకలమను కొంటిరి కొడకా
వయ్యారి కొడకా బంగారు కొడకా
దాచేపల్లికి దానమైతి వా
ఆపక్క ఒకసేను ఈపక్క ఒకసేను
నడుమ సాపసేను సందుననిన్ను నలుగురు బట్టి
నరికిరి కొడక వయ్యారి కొడక చిన్నారి కొడకా
దాచేపల్లికి దానమైతివా.

గోపిరెడ్డి ద్వేష్టమేవో తెలియరాదు.

# ౭౦ నందిరెడ్డి

—నందిరెడ్డి కూడా యిటువంటి దుర్మరణము పాలైనవాడే. చందమామ వంటి అంద చందాలున్న వాడట. కాంతాలోలు పత్వమే అతని పాటుకు కారణమేమోననిపిస్తుంది. వినండి.

రాజా మానందీ రెడ్డీ
    నీకిలలో బత్తె ముతీరెనా
కొడుకా మానందీ రెడ్డీ
    మల్లుపంచె కట్టుకోనీ
నల్లకోటూ తొడుక్కోనీ
    పల్లెదోవన బోతవుంటే
పాలెగాడను కుంటిరా
    కొడుకా మానందీ రెడ్డీ
కట్టమీదా బోతవుంటే
    కలకటేరను కుంటిరా కొడకా
రాజా మానందీ రెడ్డీ
    నీకిలలో బత్తె ముదీరెనా
నున్నంగ తలదువ్వి
    నూగాయ జడలేసి
సందువెంట బోతావుంటె
    సందమామను కొంటిరకొడకా
వచ్చిపోయ్యే దోవలోన
    దానిమ్మ చెట్టుకింద
వెండికుచ్చే నేల బడితే
    ఏటుకేతెగ నరికెనన్నా

# ౬౧ వీరభద్రారెడ్డి

— వీరభద్రారెడ్డి కథేవేరు. ఇది మా ప్రతాపరెడ్డిగారి సేకరణ. ఈ గేయములోని వీరభద్రారెడ్డి శ్రీనాథకవి సార్వభౌముని ప్రభువే అయి యుంటే తెలుగులో ఇదే అతి ప్రాచీనమైన జానపదగేయము.

రెడ్డొచ్చె రెడ్డొచ్చె రెడ్డొచ్చెనమ్మా వీరభద్రారెడ్డి విచ్చేసెనమ్మ
పొద్దున్నె మా రెడ్డి పొరకూడిపించు
నిలువెల్ల నడివీధి నీరుజల్లించు ॥రెడ్డొచ్చె॥
సందుగొందులలోను సాన్పుపోయించు
చీకట్ల పసుపుకుంకుమలు పూయించు ॥రెడ్డొచ్చె॥
రంగవల్లులనూరు రాణింపజేయు
తోరణాల పంక్తులా తులకింపజేయు ॥రెడ్డొచ్చె॥
దివ్వెలను వెలిగించు దివ్యమార్గాల
మాపల్లిపాలించు మంచిమార్గాల ॥రెడ్డొచ్చె॥
ఎండలకు పందిళ్ళు వేయించువాడూ
పొందుగా మారేళ్ళు కోయించువాడూ ॥రెడ్డొచ్చె॥
ఊరిబావులలోన ఉప్పుసున్నాలా
వెదజల్లునేటేట నిండుపున్నానా ॥రెడ్డొచ్చె॥

చల్లని ఇంపైన గేయముకూడాను! ఈ సంపుటములోనే భక్తిగేయాలలో ఇచ్చిన “శివశివయనమేలు తుమ్మెదా, శివయంటేను వినమేలు తుమ్మెదా” అన్నది దీనికంటె ప్రాచీనము (అనగా పాల్కురికి సోమనాథుని కాలమునాటిది) కావచ్చుగాని ‘అవును’ అని నిశ్చయముగా చెప్పలేము. దీనిలో వీరభద్రారెడ్డి పేరుగలదు; పలు నాటివేస నటానికి ఆక్షేపణలేదు.

వీరగాథలను రచింపజేసే ఉత్సాహమూ మెప్పుదల, - ఒకొక్కప్పుడు - మరణమూ ప్రాస్తావిక పదములకుకూడా కారణమౌతవి. వీరుల జీవితములైనా, నీచకృత్యములైనా అనుకోకుండా వచ్చేటివే కదా ? అట్లాగనే అకస్మాత్తునాటకరంపై తిరుగుబాట్లు, గోదావరి పుష్కరాలు, బియ్యపు కంట్రోలు అన్నవి ఒకొక్క సమయానికి అవతరిస్తావి.

మొన్న వచ్చిన గోదావరి వరదలపై ఎన్నిపాటలో వచ్చాయి. 'ఎల్లమ్మ చెరువుపేరు' ఏనాడో పొంగి రైలుతోసహా రైలువంతెనను కొట్టివేసిన పాట ఒకటిఉన్నది. రాజకీయ గేయములుకూడా ఒక ఉద్యమాన్ని పట్టి బయలుదేరినవే. పొట్టి శ్రీరాములుగారి మీద 'జోహార్ జోహార్' అన్నపాట చక్కనిది బయలుదేరినది, "అల్లూరి సీతారాం రాజా" అన్నది వీరగేయమే.

---

# ౬౩ అవిరేణి పాట

జానపదుల వివాహోత్సవాలలో రంగులతో చిత్రించి అలంకరించిన అవిరేణిఘటమునకు ప్రాముఖ్యత ఎక్కువ. అవిరేణి, లేక అయిరేని — ఐరేని అనటంకూడా కద్దు — పాటలు తెలుగునాట విరివిగా ఉన్నవంటారు. మాకురెండే లభించినవి.

అలికిన పూసిన అరుగులమీద
ఆకుతేలు కుట్టింది నిన్ను బావయ్యా
చీపురుకట్టొకచేత దీపమొకచేత
దిగదుడువవచ్చిన చినబావనుకుట్టె
అన్నదమ్ములబాధ తాజూడలేక
అట్టెపెళ్లి పెదబావ నట్టేటదిగును
కానకవారమ్మ కాలువలోదిగును
ఎరుగకవారితండ్రి ఏటిలోదిగును
శతమానాలకువెళ్లిన చేడెలనుజూచి
కంసాలిగంగయ్య కాలువలోదిగును
అవిరేణికివెళ్లిన అక్కలనుచూచి
కుమ్మరివెంకన్న గుంటలోదిగును
బాసికానికివెళ్లిన బావలనుచూచి
మంగలిసుబ్బయ్య మంటలోదిగును

ఇది అవిరేణిదగ్గర పాడునట్టి పాటకాదు, అవిరేణిని గురించినపాట అనిపిస్తున్నది.

---

# ౭౪ అవిరేడు మంగళ హారతి

— ఈ రెండవది అవిరేణిపాటయే. తలంబ్రాలు పోయించిన తరువాత శిరస్నానాలు వధూవరులకు చేయించి, పెళ్లిపీటలమీద ఆశీర్వచనాలు చేసి, అరుంధతికి మ్రొక్కించి, పేరంటాండ్రతో అవిరేడు వద్దకు తీసుకపోయి వధూవరులచేత అవిరేడునకు మ్రొక్కించి ఈ మంగళహారతిని పాడుదురట.

జయమంగళం । నిత్యశుభమంగళం
జయ; జయా! మంగళం । మహోత్సమంగళం ॥జ॥
దివ్యాంబరములుగట్టి । దీపాల వెలుగున
నవ్వుచూ; మహాలక్ష్మి । నాట్యమాడా
యిలవేల్పునీవు । వెలసితివి, మాయింట ॥జ॥
సిరిగజ్జెలనుగట్టి । చిందులు ద్రొక్కుచు
సిరిలక్ష్మిమాయింట । స్థిరముగానూ
యేకచిత్తంబున । యెప్పుడుకలకల
బాయక, భక్తిలో । నుందువమ్మా ॥జ॥
మల్లెతోటలోను । మసలుతూ! మహాలక్ష్మి
యెల్లలోకంబులు । యేలుతూనూ
యుల్లాసంబుతోను । యూరుపాలించుచూ
యెప్పుడు, సుప్పాంగు । తుందువమ్మా ॥జ॥
కనకగద్దెమీఁద । కదలకకూర్చుండి
[illegible]
కోరినకోరికలు । కోనసాగింతువని

బలువయిన, పట్టువేం । పడితిమమ్మా ॥జ॥
కొప్పుచక్కగబెట్టి । గొజ్జంగులనుముడిచి
పమిడి, జల్తారు । పట్టుచీరగట్టి
రంగైనరత్నాల । రవికనుతొడిగిన
భక్తపోషిణిమమ్మ । పాలించవమ్మా ॥జ॥
ఆభరణములుతెచ్చి । అలంకరించిసిరి.
పసిడిగొలుసులుతీర్చి । బాగుగవేసి
గంటలొడ్డాణంబు । కన్నతల్లికిపెడుదు
కన్నబిడ్డలనుచు । కరుణించుతల్లి ॥జ॥
అందముతోనీపను । లమరించినట్లు
తప్పులనుబట్టక । దయనుజూడు
యెప్పుడునీపాద । యేకసేవజేతు
యెప్పటికీనీవద్ద । నుంచవమ్మా ॥జ॥

ఆడుపడుచు అత్తవారింటికి కదలేఘట్టము గృహజీవనములోని సుందర దృశ్యాలలో ఒకటి ఈ పాటలో అత్తింటికి పోయేపడుచులు పలుకుతున్నది.

# ౬౫. అత్తింటికి

మాబావ వచ్చాడు ఓయిసెల్లూలా
నేనెల్లి వత్తాను ఓయిసెల్లూలా
కొత్త సీరాలెన్ని ఓయిసెల్లూలా
కొబ్బెరా బెల్లాము ఓయిసెల్లూలా
సీటి గుడ్డాలెన్ని ఓయిసెల్లూలా
సిల్కు సీరాలెన్ని ఓయిసెల్లూలా
పైట పావడాలు ఓయిసెల్లూలా
పట్టూడా లెన్నో ఓయిసెల్లూలా
మాబావ వచ్చాడు ఓయిసెల్లూలా
నేనెల్లి వత్తాను ఓయిసెల్లూలా
నన్ను మరువాకండి ఓయిసెల్లూలా
నామాట మరువాకు ఓయిసెల్లూలా
అమ్మ మాటయీను ఓయిసెల్లూలా
అన్నాకి తమ్ముడికి ఓయిసెల్లూలా
అమర్చి పెట్టావె ఓయిసెల్లూలా
ఇరుగు పొరుగోరితో ఓయిసెల్లూలా
ఇష్టంబుగా వుండు ఓయిసెల్లూలా
పొద్దు ఎక్కక ముందు ఓయిసెల్లూలా
పక్కా నుంచి లెగిసి ఓయిసెల్లూలా
పెతి రోజు గుడికిన్ని ఓయిసెల్లూలా

పదిలింగ ఎల్లిరావె ఓయిసెల్లూలా
పళ్ళు పువ్వూలున్ను ఓయిసెల్లూలా
పట్టూకెళ్ళ వోలె ఓయిసెల్లూలా
ఓయి మాబావ వచ్చేడు ఓయిసెల్లూలా
నేనెల్లి ఒత్తాను ఓయిసెల్లూలా

ఈ పాట వింటే, కుమార్తె తరలి పోయిన తర్వాత

" ఏరెంత వెళ్ళుపమ్మ యిసుక సన్నమ్మ
ఏరుదాటి వెళ్ళింది ఎవరాడ పడుచు
మూట నున్నది పసుపు పొట్లాన కుంకం
వడి నిండ పోకల్లు పండుటాకుల్లు
భమిడి శ్రీ పిల్లమ్మ సారె వెళ్ళింది "

అన్న పాట గుర్తుకు వస్తున్నది.

---

## ౬౬ మేలుకొలుపు ✓

— ఇది అత్తింటి ముద్దుకోడలికి మేలుకొలుపు. "లేవే సీతమ్మా మాయమ్మా ముద్దులగుమ్మా లేవే బంగరుబొమ్మా లేవే అదియేమే మాయమ్మ పొద్దుపోలేదా నీకు అత్తవారిల్లిది లేవే"

అన్న మేలుకొలుపు గుర్తుకు వస్తుంది ఇది వింటే.

జాజిపూల జలకమాడి
పాలవెల్లి పాలకెక్కి
అత్తయింట నడుగుపెటి
మొగుడురాగ మొగముదాచి
ఎందుకింత సిగ్గుపడుదు
వేలనీకు యింతసిగ్గు ?
తాడిచెట్టు తలనుదన్ని
తాతనీడ తరిగిపోయె
నిదురలెమ్మ నిమ్మకాయ
కళ్ళువిప్పు కందపిలక
త్వరగలెమ్మ తల్లిగాదె
చిలుకవచ్చి చెటుమీద
పిలుచుచుండె పిల్లనిన్ను
వేగలెమ్మ వెన్నయిదిగొ
కిత కిత కిత కిత కిత కిత



# ౭౭ వదినె పాట

— మనవారి హాస్యాలు సన్నితంగా వుండక మోటుగా నుంటవి. గురజాడ వారివరకే వరకూ తెలుగువారు హాయిగా చక్కగా నవ్వటమే నేర్చుకోలేదు. మోటుహాస్యపు పాటలలో ఒకటి.

వదినెకు వగదర
బిందెకు బిగదర
బంగరు కుచ్చుల మావదినే
గోడపొంటి రెండునల్లులు పారుతె
ఉలవలంటదీ మావదినే
బుక్కుతనంటది మావదినే

నరాలపొంటి తేళ్ళుపారుతె
సేవాలంటది మావదినే
తింటనంటది మావదినే
దూలాలపొంటి పాములుపారుతె
కడియాలంటది మావదినే
పెట్టుకుంటనంటది మావదినే

శెక్కెరబుక్కి దొడ్లవంటే
చీమలుకుట్టిన మావదినే
అన్నంతినక అర్రలవంటే
అన్నయ్యకొట్టిందా వదినే

# ఉలా సిరాడిన చేడె

—పండిత కవుల దృష్టి కందని సుందర దృశ్యము స్త్రీల పాటలలో నిక్కముగా కనబడు తున్నది. పల్లెటూరి నీలాటి రేవులలో ఇది దిన దినమూ ప్రత్యక్షమే.

నీలాటి రేవంత నిగ్గు తేరింది
ఏచేడె కడిగింది ఈచాయ పసుపు
పచ్చిపసుపు దెచ్చి మరద లాడింది
అణుప్పసు పన్నల్ల చెల్లెలాడింది
కొట్టుపసుపు కోమాళ్ళ తల్లియాడింది
చాయపసుపు దెచ్చి పూయనేర్చిందీ
శాంతమ్మబంగారు చాయల్ల దేర
కోమాళ్ళతల్లియే తానుగోపమ్మ
గొంతి యాడిన పసుపు గోవపూఛాయ
అన్నల్ల చెల్లెలే తానుఅమ్మాయి
అతివ ఆడినపసుపు ఆవపువుచాయ
బావల్ల మరదలె తానుఅమ్మాయి
పణతి ఆడినపసుపు బంగారుచాయ

పసుపుకుంకుమలు సౌందర్య సామగ్రియేగాని ఆరంభములో మాంగల్య చిహ్నములుగా పుట్టలేదు. పరాధీనభారతము వానిని మాంగల్య చిహ్నములుగా పరిగణించుకున్నది.

నేడు తెల్లవారి వెల్లపోడులు సదాచారమై పోయినవి. దేశీయ సౌందర్యసామగ్రి వైపు మన తరుణుల దృష్టిమరలునుగాక.

## ౮౯ తడికా, తడికా

— భార్యాభర్తల నడుమ కలహాలు వచ్చినవి. అంతలోనే [illegible] హెచ్చినది. మాటలాడుట కూడ చిన్నతనమే. తడికకు మధ్యవర్తిత్వము ఆపాదించినది. అయితే ఎంతసేపుండగలవు కలాపాలు?

వంకాయ, వండాను । వరికూడువార్చాను,
తినమనిచెప్పవే? తడికా! తడికా!
వగలాడిమాటలకు । వళ్లంతమండింది
వద్దనిచెప్పవే? తడికా! తడికా!
పట్టుచీరతెచ్చాను । పెట్టెలోపెట్టాను
కట్టమనిచెప్పవే? తడికా! తడికా!
చీరకంచులులేవు । చుట్టుచెంగులులేవు.
వద్దనిచెప్పవే? తడికా! తడికా!
సంతలోకివెళ్లి । సరిగంచుచీరను
అద్దాలరవికను! అతివతెచ్చెదకట్టుకోవే!

# ౨౦ వెఱ్ఱి బావ

— వెఱ్ఱిబావను ఉడికిస్తుంది గడుసు పెండ్లాము. అడుగడుగునకూ అనుమానము కలిగిస్తూ చిక్కు విప్పేస్తుంటుంది.

ఒకరికీ చేతులిచ్చాన్ ఒకరికీ కాళ్ళనిచ్చాన్
ఒకరిని చేతబట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్
ఎవరికీ చేతులిచ్చావ్ ఎవరికీ కాళ్ళనిచ్చావ్
ఎవరిని చేతబట్టి కూకున్నావే పిల్లా కూకున్నావే
గాజుల్ కి చేతులిచ్చాన్ కడియాలకి కాళ్ళనిచ్చాన్
డబ్బుల్ని చేతబట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్
ఒకరినీ నానవేశాన్ ఒకరిని చితకాకొట్టాన్
ఒకరినీ చుట్టచుట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్
ఎవరినీ నానావేశావ్ ఎవరిని చితకాకొట్టావ్
ఎవరిని చుట్టాచుట్టి కూకున్నావే పిల్లా కూకున్నావే
సున్నాన్ని నానవేశాన్ వక్కల్ని చితకాకొట్టాన్
ఆకుల్ని చుట్టాచుట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్
ఒకరినీ కట్టివేశాన్ ఒకరినీ వదలీవేశాన్
ఒకరిని చేతబట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్
ఎవరినీ కట్టివేశావ్ ఎవరినీ వదిలీవేశావ్
ఎవరినీ చేతబట్టి కూకున్నావే పాపీ కూకున్నావే
ఆవుల్ని కట్టివేశాన్ దూడల్ని వదిలీవేశాన్
చెంబూనీ చేతబట్టి కూకున్నానోయ్ బావా కూకున్నానోయ్

# ౭౧ ఎదురు చూచే వదిన

— బావమరిది వ్యాపారానికి వెళ్ళినాడు. ఏదో ఒక నాటికి వస్తానని చెప్పి 'దేశము' వెళ్ళిపోయినాడు. గడపలు దాటినవి. రాలేదు. ఆమె ఆవేదనను గుర్తించండి.

ఏఒదినా ఏఒదినా ఎందుకేడుత్తావు
ఎర్రినా ఒదినా సువ్వేంటౌనె సెప్పు
దేశమెళ్లిన మీఅన్న తిరిగి రాలేదు
తిరుగొత్తె బాగున్ను తీర్తమెలుదూము
ఎల్లినో డెల్లినట్టె ఉండిపోతాడ
రేపోమాపోగాని తిరిగొత్తాడొదిన
సెప్పెల్లిన గడుపూలు దాటిపోనాయి
సెట్టెక్కి సూడోలె వత్తున్నడేమొ
సెట్టొద్దు సేమొద్దు ఊరుకో ఒదిన
రాబోయె మాయన్న రాకమానడు
సూసీ సూసీ కళ్ళు కాసిన్నై కాయాలు
మేసేటి ఆవూలు మానిన్నై మేతాలు

కలత ఎక్కడికి పోగలదు ? ఆవులకు కూడా ప్రాకినది.



# ౭౨ ఓరందకాడ

—జానపదులలో మామను పెండ్లాడుట కలదు. పలు అవతారములతో ప్రత్యక్షమయ్యే ఈ పాట 'దేశమెల్లిన' మామనుద్దేశించి అతని ప్రేయసి పాడిన పాట.

ఓ-రందకాడ బంగారు మామ
చంద్రగిరి చీరలంపరా ॥
చంద్రగిరీ చీరలంప్రా కాకినాడా గాజులంపు
రాజమండ్రీ రైక లంపుమురా ॥ ఓరందకాడ ॥
నీకు నాకూ దూరమాయె నీలికొండలడ్డమాయె
కొండకెక్కి గొఱ్ఱె మేసిందోయి ॥ ఓరంద ॥
నిమ్మచెట్టుకు నిచ్చెనేసి నిమ్మపళ్లూ కొయ్యబోతె
నిమ్మముళ్లూ రొమ్ము నాటెనోయి ॥ ఓరంద ॥
నీకు నాకూ దూరమాయె నల్లకొండ లడ్డమాయె
నల్లగున్న సాలునంటిరా ॥ ఓరంద ॥
నందియాల నందుల్లోన ధర్మలారుదారుల్లోన
కాలుజారితే కదలనివ్వరురా ॥ ఓరంద ॥
దచ్చినాన గాలిలోనే వచ్చే నల్లమబ్బులోను
వన్నె వన్నె వార్త లంపుమురా ॥ ఓరంద ॥

ఇది ఏలపాట. తాళ్లపాక చినతిరుమలాచార్యులు దీని లక్షణమును సంకీర్తన లక్షణములో వ్రాసెను గాని అది కేవలము దీని రూపవర్ణనము మాత్రమే చేయుచున్నది. దీని గతి 'తకకిటతక' అని ఆరక్షరాల ఆవృతాలు నాలుగుచొప్పున గల రెండేసి పాదాలతో నడుస్తున్నది. రెండో పాదములో చివరి రెండావృతాలకున్నూ "రా,ఓ" అన్న రెండక్షరాలే ప్రాసానాలు.

ఏలలు యక్షగానాల్లోగాని, వీధినాటకములలోగాని, స్త్రీల పాటలలోగాని ఉన్నప్పుడు వాటికి ఇదే లక్షణము. అప్పకవి తక్కిన దేశిఛందములను వివరించునప్పుడు వలెనే ఏలల వివరించునప్పుడును పద్యంలో అడుగుసైచినాడు. 'భానువంశమానబుట్టి' అన్న కంద కూరి క్షుద్రకవి ఏలను 'తకిట తకిట' అని త్రిశ్రగతిలో పాడుకున్ననూ పాడుకోవచ్చును. ఏల యొక్క గతి, రెండుమానాలుగూ అక్షరాలుగా తెంపిననే నిర్దుష్టముగా స్ఫురించగలదు. ఈ ప్రత్యేకతను చెప్పకుంటే వేరేది చెప్పినను ఫలములేదు.

ఏలపాటలు రాయలసీమ జానపదగేయములలో మిక్కుటము. అందువల్లనే కదిరీపతి "వీధిబోయెడు ప్రౌఢ విటుడు పాడెడువింత ఏలపదాలట్టె యాలకించు" నన్నాడు. వీటిలో పాటకు ప్రాధాన్యత హెచ్చు, తెలుగు జానపదగేయములలో సంగీతమాధుర్యము రాయలసీమ పాటలలోనే హెచ్చు.



# ౭౩ గొబ్బియళ్లో

— ఇవి చూడండి. పల్లెటూరి నీలాటి రేవుకడ దృశ్యములు.

పెద్దది అక్కామ్మ పెదజానతోడ గొబ్బీళ్లయళ్లో గొబ్బీళ్లయళ్లో
పెద్దది అక్కామ్మ నీళ్లకుపోను ,, ,,
ఎంతచక్కగా ఏడుమెట్లుదిగె ,, ,,
గడగడన కడవకడిగి బుడబుడనముంచె ,, ,,
చుట్టూపక్కలచూచె ఎవ్వరులేరు ,, ,,
కట్టపైన పోయేటి గింగుట్లరాజు ,, ,,
కడవట్ల ఎత్తుదువూ రావయ్యారాజ ,, ,,
ఎత్తితే ఎత్తేను పేరేమిచెప్పు ,, ,,
పేరేమిచెప్పేది పేదోళ్లపాప ,, ,,
నాపేరువజ్రమే కడవపేరు ముత్యమే ,, ,,

అక్కమ్మ అన్నమాట పెద్దపిల్ల అన్న అర్థముతో దేశిసారస్వతములో కనబడుతుంది. అది సామాన్యనామ మన్నమాట.

## ౭౪ నీటి చెలమ వద్ద

తమల పాకుల మీద వజ్రాండ బోసి
నేబోతు కృష్ణమ్మ నీటి చెల మలకి
ఊరగదే పుదకంబు తేరగదే పూట
చేరగదే నాచేతి ముత్యాల బిందె
అటుచూచి యిటు చూచి కట్టాంకజూచి
కట్టమీద బోయేటి పొట్టి కోమటి
ఆవులు గలవారి ఆడమనిషిని
కోడెలు గలవారి కోడల్ని నేను
మేకలు గలవారి మేనకోడల్ని
మాఅత్త కొట్టాది బిందెత్తి పోమ్మ
మీఅత్త కొట్టనేల బిందెత్త నేల
అటు జూచి యిటు జూచి బాటాంక జూచి
బాటమ్మట వెళ్ళేవు ఓ బాపనయ్య
ఆవులు గలవారి ఆడమనిషిని
కోడెలు గలవారి కోడల్ని నేను
మేకలు గలవారి మేన కోడల్ని
మాఅత్త కొట్టాది బిందెత్తి పోమ్మ
మీఅత్త కొట్టనేల బిందెత్త నేల
అటు జూచి యిటు జూచి గట్టాంక జూచి
గట్టు మీద పోయేటి పూజారి మాయన్న

ఆవులు గలవారి ఆడమనిషిని

కోడెలు గలవారి కోడల్ని సేసు

మేకలు గలవారి మేన కోడల్ని

మాఅత్త కొట్టాది ఒంటెత్తి పొమ్మ

మీఅత్త కొట్టనేల ఒంటెత్త నేల

అల్లదిగో మాఅత్త తానె వస్తున్నాది

ఎత్తొద్దు ఎత్తొద్దు వెళ్ళండి బాబు

అత్త వచ్చినచో ఒంటె తనంతట తానే నెత్తిపైకి లేవును. ఒంటెకు కూడా అత్తగారన్న భయమే. నిండు ఒంటె నెత్తిపై మోయు అలవాటు పూర్వాంధ్ర సీమ పాటకపు జనములకు కలదు.



# ౭౫ వెర్రి మగడు

—ఒక పెండ్లాము శ్లేషార్థమును పట్టి పెనిమిటిని ఎగతాళి చేస్తున్నది. ఈ గేయము పశ్చిమ గోదావరి మండలానిది.

ర్యాలీ రావులపాడు రేలంగి సంతలోన
ఉప్పెపరిగె తెచ్చినానె ముక్కయ్యవేపిల్ల ముక్కయ్యవే

ఓరోరి నామగడ వయ్యారి నామగడ
ఎర్రిబాగుల నామగడ ఎర్రిబాసి నామగడ
రెక్కలున్న సేపకీ ముక్కులుంటాయా ?

నరసాపురం పాలకొల్లు మారుటేరు సంతలోన
కోడిపెట్ట తెచ్చినానె గుడ్డయ్యవేపిల్ల గుడ్డయ్యవే

ఓరోరి నామగడ ఒయ్యారి నామగడ
ఎర్రిబాగుల నామగడ ఏర్రిబాసి నామగడ
జుట్టున్న కోడికీ గుడ్డుంటదా ?

భీమవరం ఆకీడు ఈరవాసరం సంతలోన
గేదెపెయ్య తెచ్చినానె పాలెయ్యవే పిల్ల పెరుగెయ్యవే

ఓరోరి నామగడ ఒయ్యారి నామగడ
ఎర్రిబాగుల నామగడ ఏర్రిబాసి నామగడ
కొమ్ములున్న గేదెకూ పెరుగుంటదా పాలుంటయా ?

## ౨౬ రాజసపు కోడలు

—రాజసపు కోడలు వాలకము పరికించండి.

ఇల్లలికి ముగ్గుపెట్టి రింటి మగవారు
పేడకళ్ళు దీయు పెదబావగారు
ఇంటి పనులు చేయు ఇంకో బావయ్య
అంటు లన్నియు దోము అత్తయ్యగారు
ఇంటి పనులు సయ్యో విడిదిలేవమ్మ ;

దుబ్బుపుల్లపది పంచటరుగేది ?
చిట్టిముంత నీళ్లివి చిరుపసుపేది ?
కుంకపు బరిణేది అద్దముపది ?

చూడరా ఆడదాని సురటి మాటలు
చూడరా ఒకదెబ్బ చూడరా ఇకను ;
ఎక్కరా చింతచెట్టు విరవరా జూక
వెయ్యరా ఆజూక వెన్నుపొడుగునను ;

ఆరు నెలల బాల చంక బెట్టుకుని
పుట్టింటికప్పుడు మరిదొడుతీసె
అల్లంత దూరాన అన్నలుచూసి

"ఏమమ్మ చెల్లెలా! ఇట్లు వచ్చేవు?"

"కానక కాండ్రేగు పక్షుల్నెగోర
నేరక నేరేడు పక్షుల్నెగోర
కారుష్టములు పలికె కాంతుడు మావారు
నేరాలు మోపేరు వారందరును"
కుదించి కుదించి గోషుచెందంగ
ఓదార్చి తమయింట నుంచె మన్నారు

వాఖ్యాన మనవసరము. నుదిటి, అన్నాని దేశిపదము. నూటె మిద్దెలు, సీతెమ్మ నుదిటి అనే పదములు దేశిలో కనబడుతాయి. 'అన్నెకారి' యన్నది ఇంకొకటి.

---

# ౭౭ వేరే పోదామా

—అవిభక్త కుటుంబపు నీడలోనే వేరింటి కాపురము గూడు కట్టును. ప్రౌఢ తనభర్త నడుగు చున్నది.

సందమామకన్న సక్కాని మొగుడా
వేరే పోదామా ?
అత్త మామలపోరు నేనుపడలేను
ఆడబిడ్డలపోరు నేనుపడలేను ॥ సం ॥

ఉంగరాలచేయి ఊగెరా మొగుడా
కందిరీగా నడుము కదిలేర మొగుడా
వేరే పోదామా ॥ సం ॥

కొండంత కొప్పేమొ కదిలేర మొగుడా
కొప్పుపై జాజులు వాడెరా మొగుడా
వేరే పోదామా ॥ సం ॥

లక్ష్మి-రాజు గంగయదాసు పాట ఒకటి ఇటు వంటిదే కాని ఇంత కన్న పెద్దది ఉన్నది.

# ఐలా ఏరాలు

___వేరే పోషనగానే సరికాదు. అక్కడనూ సమస్యలు కలవు. ఆడుంగ' కంటే ఈ'కొంగ' తోనే ఎక్కువ బాధ !

పు :- ఏరాల్ని తెస్తాను । యింటిలో పెడతాను
ఏరాలి మాటవినాలి । సుందరి పిల్ల
యేరాలి మాటవినాలి । నాయుడో లమ్మో ॥ ఏ ॥

స్త్రీ :- ఏకులోడుకు తాను । యేరొండి పెడతాను
యేరాలి పోరు పడలేను । సుందర మగడ
యేరాలి పోరు పడలేను । సోకుదారి మగడ ॥ ఏ ॥

పు :- వండి పెట్టలేవా । వడ్డించలేవా
కోనేటి నీళ్లుతేలేవా । సుందరి పిల్ల
నామాట వినాలే । నాయుడో లమ్మో

స్త్రీ :- కూకుంటె లెగలేను । కూడొండి పెట్టలేను ॥ ఏ ॥
కోనేటినీళ్ల కెళ్లలేను । సుందర మగడ
కానిమాట లనబోకు । సోకుదారి మగడ ॥ ఏ ॥

పు :- బంగారపు బొమ్మ । బెంగుళూరు గుంట
దాని నడుము నాగబంధములే । సుందరి పిల్ల
దాని నడక హంస నడకలే । నాయుడో లమ్మో ॥ ఏ ॥

స్త్రీ :- దాని మాయలోను పడబోకు ! నాయుడుబావ
దాని సోకులోను దిగబోకు ! సుందర మగడ
దాని మాటలైన వినబోకు ! సోకుదారి మగడ

పు :- వడ్డాణ మిదిగోయె । వయ్యారి భామా
నీ నడుముకైన పెట్టుకోయె । సుందరి పిల్ల
నీ నడుము చక్కగుంటుందె । నాయుడోలమ్మా ॥ ఏ ॥

స్త్రీ :- ఎప్పుడెట్టు కోవాలో । అప్పుడెట్టు కోవాలి
పండుగ పున్నానికి । సోకుదారి మగడ
అదిఅప్పుడెట్టు కోవాలి । నాయుడు బావ

తడిక పాటలోని చిన్న అలుకవలె పెద్ద అలుకలు కూడ నగతో పటాపంచలు !

---

# ౨౫. సిరిసిరి మువ్వపాట

—అయితే సాలుతో సంతుష్టి చేయగలవా ఎన్నాళ్లు సవతి బాధ భరించగలదు మగువాలు?

ఈమంచి కాపురము ॥ సిరిసిరి మువ్వ ॥
నాకే మంచి లెచ్చింది ॥ సి ॥
అన్నపూర్ణ కాపురము ॥ సి ॥
కన్నవారి యిల్లుకాదా ॥ సి ॥
రంగమ్మ కాపురము ॥ సి ॥
రత్నాల మూటకాదా ॥ సి ॥
ప్రక్కపాపి డేలనని ॥ సి ॥
పక్కలిరగ తన్నేడే ॥ సి ॥
జాకెట్టు తొడిగితే ॥ సి ॥
షోకేలనని తన్నేడే ॥ సి ॥
పాకిదాని లాగుంటేని ॥ సి ॥
పకపకవాడు నవ్వేడే ॥ సి ॥

“కూరిమి విరసంబైనను నేరములే తోచుచుండు నిక్కము సుమతీ!”

—

# ౮౦ పుట్టినింటికి

—ఆభిజాత్యము ముదిరిన సిరిమంతులకు కష్టదాయకమైనవి ప్రయాసలు. పాటకపు జనములో ఇవి పరిపాటియే. మగని బాధపడలేక పుట్టినింటికి నడక సాగించినది ఒక్క పాటకపు పడుచు! "కాశీకెళ్ళదామంటె కదలవే కాళ్ళు, ఢిల్లీకెళ్ళదా మంటే ఒంగదు మనసు. నాన్నా పుట్టింటికి కెళ్దాము అంటె, నాకాళ్ళు పన్నిన్ని రథములై నడచు నా చేతులు ఉయ్యాల చేరులై పోవు." అయితే దారితోడు నుంచి ప్రశ్న వచ్చింది.

ఏవూరు ఏపల్లి తుమ్మెదా
ఎక్కడికి ఎల్తావు తుమ్మెదా
గులకల్లపాడూ గుమ్మాడే
గోదారి పక్కని గుమ్మాడే
గులకల్లపాడూ తుమ్మెదా
అత్తోరు ఊరూ తుమ్మెదా
పుట్టిల్లులేక తుమ్మెదా
పుట్టిల్లు మాదా గుమ్మాడే
గులకల్లపాడే గుమ్మాడే
పాడిపంటఉందా తుమ్మెదా
సంతానముఎందరె తుమ్మెదా
పాడిపంటలేదు గుమ్మాడే
సంతానములేదు గుమ్మాడే
అత్తగారుఉందా తుమ్మెదా
ఆడబిడ్డలు ఉన్నారా తుమ్మెదా

అత్తగారుపోరు గుమ్మాడే
ఆడబిడ్డలుపోరు గుమ్మాడే
పడలేక నేను గుమ్మాడే
మావారు పోతున్నా గుమ్మాడే
పెద్దవారులేక తుమ్మెదా
కంతబుద్ధి సెప్పడానికీ తుమ్మెదా
బుద్ధిసెప్పేవాళ్ళకి గుమ్మాడే
అసలుబుర్రేలేదు గుమ్మాడే
అత్తలేనియిల్లు తుమ్మెదా
ఆరళ్లు ఉండదు తుమ్మెదా
ఆయిగా ఉంటాను తుమ్మెదా

బుద్ధిచెప్పేవారు ఎక్కడా వున్నారు. అసలుసంగతి వారికెట్లెరుక పడును? తెలీ పోయినా చెప్పటకుండరూ పెద్దలే. వారికే "బుద్ధిలేదట" ఇలాంటి పదములే

"ఆడబానిసయి పుట్టుటకంటె
అడవిలో మానయి పుట్టుటమేలు"

అని నిట్టూర్పులు నిగిడ్చేది!

# ౮౧ వియోగము

—ఏకారణమువల్లనో భార్యను పుట్టినింట విడిచివచ్చినాడు యువకుడు. ఆమె అక్కడా ఈతడిక్కడా బాధపడుతున్నారు,

ఎన్నాళ్ళో; ఈబంధకానాలు ; మాకెన్నాళ్ళో ॥ఈ॥
కదిలివచ్చేనాడే । కారుమబ్బేసింది
కలికిరోనాయెల్లి । వెలవెల బోయింది
కందినసెక్కిళ్ళు । కడవలలో బోసింది
కాటుకకన్నీళ్లు । నీలాలు నాయెల్లి ॥ ఎ ॥
గడియసేపయిన నన్ । విడిసినోడుకాడు
పడనాకయేడాది । పాశైనకాలేదు
నడిమంత్రమున యింత । మిడిమేలమైపోయె
కడకునా కాపురము । కడగళ్ళపాలాయె ॥ ఎ ॥
సీలమండాదాక । సిందాడుతలకట్టు
కలువపూలు జుట్టి । కడవంత కొప్పెట్టి
పొలుపైన కుంకుమ్మ । బొట్టు కాటుకబెట్టి
గున్నయేనుగు మల్లె । గునగునా నడకలు నాయెల్లి ॥ ఎ ॥
వలరాజు అందాల । వన్నెచిన్నెలరాజు
నిలువెత్తు నట్టిల్లు ; నిండినారాజు
మెలిరాని నూనూగు . మీసాల నారాజు
కలలో రాతిరివచ్చి . కనిపించి పోయాడు ॥ ఎ ॥

# ౭౨ కలవారికోడలు

— అవిశ్రాంత కుటుంబమునందలి సౌందర్యమును వ్యక్తము చేస్తుంది. ఈపాట వినండి.

కలవారికోడలు కలికి కామాక్షి
కడుగుచున్నది పప్పు కడవలో పోసి
అప్పుడే ఏతెంచె ఆమె పెద్దన్న
కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీళ్ళు నించె
ఎందుకు కన్నీళ్ళు ఏమి కష్టమ్మ
తుడుచుకో చెల్లెలా ముడుచుకో కురులు
ఎత్తుకో బిడ్డను ఎక్కు అందలము
మీ అత్తమామలకు చెప్పిరావమ్మ
కుర్చీపీటమీద కూర్చున్న అత్తా
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా ?
నేనెరుగ నేనెరుగ మీమామనడుగు
పట్టెమంచము మీద పడుకొన్న మామ
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా
నేనెరుగ నేనెరుగ నీబావనడుగు
భారతము చదివేటి బావ పెదబావ
మా అన్నలొచ్చారు మమ్మంపుతారా
నేనెరుగ నేనెరుగ నీఅక్కనడుగు
వంటచేసేతల్లి ఓ అక్కగారు
మా అన్నలొచ్చేరు మమ్మంపుతారా

నేనెరుగ నేనెరుగ నీభర్తనడుగు
రచ్చలో మెలిగేటి రాజేంద్రభోగీ
మాఅన్నలొచ్చారు మమ్మంపుతార
పెట్టెలో సొమ్ములు కట్టుకో చీర
పోయిరా సుఖముగా పుట్టినింటికిని

ఎంతసుఖమైన హుకుము ! రచ్చలో మెలిగేటి రాజేంద్రభోగి ఉత్తరాంధ్రసీమ పాటలలో రెండుమూడు తడవలు కనబడుతాడు.

సరిగ్గా యిటువంటిపాటయే రాయలసీమ పాటల్లో ఒకటున్నది.

పట్టెమంచంమింద పండుండె మామా
అందరూబోతారు నందితిరణాళ్లూ స్వామితిరణాళ్లూ
నన్నేమియడిగేవు మీయత్తనడుగే
గద్దెపీటలమింద గౌరిపెద్దత్తా
అందరూబోతారు నందితిరణాళ్లూ స్వామితిరణాళ్లూ
రచ్చకట్టలమింద రాజా పెదబావా
అందరూబోతారు నందితిరుణాళ్లూ స్వామితిరుణాళ్లూ
వంటసాలలనుండె వయ్యారిఅక్కా
అందరూబోతారు నందితిరణాళ్లూ స్వామితిరుణాళ్లూ
ఎద్దూలగాసేడి ముద్దూల మఱదీ
అందరూబోతారు నందితిరుణాళ్లూ స్వామితిరుణాళ్లూ
సూదుల్లో ఉండేటి ఓమొగలీరేకా
అందరూబోతారు నందితిరుణాళ్లూ స్వామితిరుణాళ్లూ

రచ్చలో మెలిగేటి రాజేంద్రభోగికీ, సూదుల్లో వుండేటి మొగలిరేకుకీ తారతమ్యమున్నది గదా ! అది హుకుములో కూడ కన్పిస్తున్నది. ఈతడు వల్లగాదన్నాడు.

## ౭౩ తిరునాళ్లు

—తిరునాళ్ళకు పోవటముతో సరికాదు. అక్కడ చిక్కులెన్ని? తిరిగి వచ్చే వరకు క్షేమప్రతీక్ష తీరిపోతుంది.

ఎత్తే ఎల్లువుగాని ఎంతో జాగ్రతయమ్మ
చిన్నదాన్నైయుండి చిన్నామామయ్యతో
చక్కాదానాలనూ చెన్నకేశవుల
తిరునాళ్ళనే బోయి తీర్థామాడినాక
టెంకాయనే కొట్టి దీపమెలిగించి
ఉల్లడం క్రిందుగా ఊరేగుతుంటె
చిలిపివాడెవ్వడో చిన్నంగెన కొచ్చి
సంకాలో చెయిపెట్టి సరసమాడేడే
ఎనక్కిచూసే తలికి యెల్లిపోయినాడే
మాచెర్ల చెన్నడే మాయల్లవాడే

వాడెవడైనా మాచెర్ల చెన్నడే అనుకోవటములో అందమున్నది కదా! చెన్నకేశవుని ఉత్సవానికి వెళ్లినీదాయెను. ఆ చిలిపివాడెవ్వడు కాగలడు?

---

## ౮౪ చెలువుడి చెల్లెలు

—పుట్టినింట ఉన్న చెలువుడి చెల్లెలు విచారమును గుర్తించండి ఈ పాటలో. ఈమె యెవరో సుభద్రా సత్యభామలను గుర్తుకు తెస్తున్నది.

చెరువు కట్ట దున్నించి వుయ్యాలా
　　చెరుకులే నాటించి వుయ్యాలా
మంచె మీదా మంచె వుయ్యాలా
　　మంచినీళ్లా భావి వుయ్యాలా
చెలువుడీ చెల్లెల్ని వుయ్యాలా
　　చేను కావిలుంచి వుయ్యాలా
ఈనెలూ బెండ్లొలిచి వుయ్యాలా
　　మంచెలే కావించి వుయ్యాలా
వెండిదీ వడిశెల వుయ్యాలా
　　భమిడిదీ ఆరాయి వుయ్యాలా
గిరగిరాతిప్పుతూ వుయ్యాలా
　　గుప్పునా రాయొదల వుయ్యాలా
టక్కునా తగులునూ వుయ్యాలా
　　తల్లకిందుగ పడును వుయ్యాలా
పొయ్యేటి పిట్టలను వుయ్యాలా
　　బోరలే పగలేశె వుయ్యాలా
నడిచేటి పిట్టల్ని వుయ్యాలా
　　నడుములే విరగేశె వుయ్యాలా

కూర్చున్న పిట్టలను వుయ్యాలా
గుండెలే ముంగేసె వుయ్యాలా
వచ్చేటి పిట్టలను వుయ్యాలా
వడిసెతోనే వేసె వుయ్యాలా
ఆపిట్ట నీపిట్ట వుయ్యాలా
గుదికట్టుకొనివచ్చె వుయ్యాలా
చందమని పెడసొదిన నుయ్యాలా
వాకిట్లో వేసెనే వుయ్యాలా
గచ్చులో వుండేటి వుయ్యాలా
రాజేంద్రాభోగి వుయ్యాలా
వినవయ్య నీచెల్లి వుయ్యాల
వేటలాడొచ్చింది వుయ్యాల
అట్టిమాటలు మతికి వుయ్యాల
గిట్టునని చెప్పితి వుయ్యాల
ఆడదానికి ఆటలుయ్యాల
మొగవాడికి వేటలుయ్యాలా

ఉయ్యాలా అన్న పాదాంతపదము సాధారణముగా జీవుని ఉద్దేశించిన వేదాంతగేయములలో కనపడుతుంది. ఈపాటలలోనికి ఆపదము అతి వ్యాప్తివల్ల ప్రవేశించినది.



# ౮౫ బ్రతుకమ్మ పాట

బ్రతుకమ్మపాటలు తెలంగాణములోనివే. అయితే ఈపాటలో 'చందమామ' అన్న పాదాంతపదమున్నది. ఇంకొకపాటలో

— అది అన్నుకూడా అయినది — వలలో అనే ఉయ్యాలో అనే పాదాంత పదములున్నవి. బ్రతుకయ్య విష్ణువు, బ్రతుకమ్మ లక్ష్మీదేవి. బ్రతుకమ్మ పండుగలు మాత్రము తెలంగాణమున తప్ప వేరేచోట జరుగుతున్నట్టు నాకు తెలియదు. ఈపాట గోవిందనామముల వరుసలోనుండుట విశేషము.

శ్రీలక్ష్మిదేవియు చందమామ । సృష్టిబతుకమ్మయ్యె చందమామ

| | | | |
|---|---|---|---|
| పుట్టినా రీతిచెప్పె | ,, | భట్టు నరసింహకవి | ,, |
| ధరచోళ దేశమున | ,, | ధర్మాంగుడనురాజు | ,, |
| ఆరాజు భార్యయు | ,, | అతిసత్యవతి యండ్రు | ,, |
| నూరునోములు నోమి | ,, | నూరు మందినిగాంచె | ,, |
| వారు శూరులయ్యి | ,, | వైరులచే హతమైరి | ,, |
| తల్లిదండ్రు లపుడు | ,, | తరగనీ శోకమున | ,, |
| ధనరాజ్యముల బాసి | ,, | దాయాదులను బాసి | ,, |
| వనితతో ఆరాజు | ,, | వనమందు నివసించె | ,, |
| కలికిలక్ష్మిని గూర్చి | ,, | ఘన తపంబొనరించె | ,, |
| ప్రత్యక్షమై లక్ష్మి | ,, | పలికె వరమడుగుమని | ,, |
| వినుతించి వేడుచూ | ,, | వెలదితన గర్భమున | ,, |
| పుట్టుమని వేడగా | ,, | పూబోణి మదిమెచ్చి | ,, |
| సత్యవతి గర్భమున | ,, | జన్మించె మహాలక్ష్మి | ,, |

అంతలోమునులునూ చందమామ । అక్కడికి వచ్చిరి చందమామ
కపిలగాలవులునూ ,, కశ్యపాంగిరసులు ,,
అత్రి వశిష్టులూ ,, ఆకన్నియను జూచి ,,
బ్రతుకగనె యీతల్లి ,, బ్రతుకమ్మ యనిరంత ,,
పిలుతు లదివరనుండి ,, ప్రియముగా తలిదండ్రి ,,
బ్రతుకమ్మ యనిపేరు ,, ప్రజలంత అందరూ ,,
తాను ధన్యాడంచు ,, తనబిడ్డతో రాజు ,,
నిజ పట్టణముకేగి ,, నేల పాలించంగ ,,
శ్రీమహా విష్ణుండు ,, చక్రాంకు డనుపేర ,,
రాజు వేషంబున ,, రాజు ఇంటికి వచ్చి ,,
ఇల్లింట మనివుండి ,, అతివ బ్రతుకమ్మను ,,
పెండ్లాడి కొడుకులా ,, పెక్కుమందిని గాంచె ,,
ఆరువేల మంది ,, అతి సుందరాంగులు ,,
ధర్మాంగుడను రాజు ,, తనభార్య సత్యవతి ,,
సరిలేని సిరులతో ,, సంతోష మొందిరీ ,,
జగతిపై బ్రతుకమ్మ చందమామ । శాశ్వతంబుగ వెలసె చందమామ

---

# ౮౭. రాయిరాయి కాగితం

వినోదములేనిదే జీవితములేదు. ఆహార నిద్రాదులు శరీరమున కానందమునిచ్చిన, వినోదము మనస్సున కుల్లాసమునిచ్చును. ఒకటింటికి తెలుగునన్నా చింతలుకమ్మిన మనస్సుక వినోదమున్నా అందము.

తెలుగునాట వినోదాలకు లెక్కలేదు. నాతానిజమ్మ్యూరూ. భద్రాద్రి యాత్రికులూ, గాండీవారూ, గంగిద్దు దాసులూ, కొమ్మదాసులూ, కోయమామలూ, పెళ్లాడే బొమ్మలూ, బాపిబుక్కలవారూ, సోదివాండ్రూ, పిసరాపిల్లలూ, ఎవరో ఒకరు ఏడాది పొడుగునా పాటలు పాడుతూ రంజిస్తూనే వుంటారు.

— అదుగో ఎర్రనిపాగా, నల్లని శరీరము, పచ్చని చెవిరింగులూ రాగి పంచకడియాలూ, ఎండువేళ్ల ముద్దులూ, పచ్చపసుపు, చంద్రవంక బొట్లూ, వీపున విల్లంబులతో కోయమామ!

నీలాటి కోయమామ మాలాటి దేశమొస్తే
ఉట్టిమీదపెట్టి ఊరేగించెదము రాయిరాయి కాగితం
వాడీడిపుణ్యాన్న అబ్బాయి పుడితేను
కోయరాజు పేరుపెట్టు కోండి రాయిరాయి కాగితం
ఏడీలు సీడీలు ఎక్కవైకొందరు
ఎనకసెక్కరాలు వెంటబడ్డాయి రాయిరాయి కాగితం
దమ్మిడీ కూలోళ్లు దగుల్బాజీ గుత్తోళ్ళు
గొప్పకు రమ్మంటేను రాయిరాయి కాగితం
కొప్పులు దిప్పేరు ఇంటిలో తలదువ్వి
ఈధిలోకొస్తేను బేడకిదానికొప్పు బేరమైంది
రాయిరాయి కాగితం

రాయిరాయికాగితం అంటే ఈ స్తరము రాయమనికాబోలు.

# ౮౨ సాముద్రికం

— కోయమామ చెయ్యిచూచి సాముద్రికంకూడా చెప్పగలడు.

సేయిసూస్తారా పిల్ల  
సేతిలోబంగారు రేకున్నది ;  
కుళ్ళాయి, కుచ్చుంది  
కూకుని తింటావుపిల్ల ;  
బాలెంత రూపుంది  
బాధపడతావు పిల్ల ;  
బండిమీద కల్లుంది  
బహుజోరుగావుంది ;  
తాగుతాగు పిల్ల  
తన్నుల్తింటావు పిల్ల ॥ సేయి ॥

ఇవి పూర్తిగా పరమార్థమున్నూ కాదు, పరిహాసమున్నూ కాదు. అక్కడే వుంది వీనిఅందము

# ౮౮ పెళ్లాడే బొమ్మ

— ఇదెవరు ? తురకబొమ్మ. రంగుల లక్కబొమ్మ తలలోనూ, చేతులలోనూ వేళ్ళుదూర్చి బీబీనాంచారి పాట పాడుతున్నది.

పెళ్ళాడే బీబీనాంచారి పెళ్ళాడేబొమ్మా
అత్తామామలపోరూ పడారాదమ్మా
మామాకూ బంగూపెట్టీ
అత్తాకూ మందుపెట్టీ
అందర్నీ సాగనంపూ ॥ పెళ్ళాడేబొమ్మా ॥

---

# ౪౭. కాశీకావడి

— గంటల కావడితో కాశీపటాలు చూపించటానికి యాత్రికుడు వస్తున్నాడు. కావడి దింపటమూ తట్టుపీరలు ముళ్ళువిప్పటమూ, చూడవచ్చినవారిని దగ్గర కూర్చోనబెట్టటమూ ఒక్కొక్క పటమూవిప్పి ప్రదర్శించటమూ — మొత్తమొక అరగంట ప్రదర్శనము !

కాశీకి పోయాను రామహరీ
కాశి తీర్థమూ తెచ్చాను రామహరీ
కాశీకి పోలేదు రామహరీ
వూరి కాలవలో నీళ్ళండి రామహరీ
కాశీకి పోయాను రామహరీ
కాశి విభూతి తెచ్చాను రామహరీ
కాశీకి పోలేదు రామహరీ
వీడి కాష్ఠంలో బూడిదండి రామహరీ
పంచేంద్రియములూ రామహరీ
నేను బంధించి యున్నాను రామహరీ
కొంచెము నమ్మినా రామహరీ
కొంప ముంచి వేస్తాడండి రామహరీ
ఆలు బిడ్డలు లేరు రామహరీ నేను
ఆత్మయోగి నండి రామహరీ
ఆలు బిడ్డాలెల్ల రామహరీ వీని
కాయూర నున్నారు రామహరీ

వెనుక మాటలు చెప్పేవాడు వాని బంధువే.

# ౯౦ పైస తమాషా

—ఏకోటకప్పు టకప్పుమని వాద్యం వినబడు తున్నది. నల్లకోటూ, ఎర్రతలపాగా, అద్దాలు మెరుస్తూ తాలూకా కచేరీ ఆకారంతో కొయ్యపెట్టె గోరుగా వున్నది వీని వ్యాపారము! చెంపలకు చేతులు చేర్చుకుని, వంగి, పెట్టెలోని బొమ్మలను ఆప్యాయముతో చూస్తున్నారు పిల్లలు కిరికన్నా మట్టూ నున్నవారి కోలాహలం జాస్తిగా ఉన్నది. వాద్యమను కున్నాము. కోర్లతో కొట్టుతూ చేతిడప్పుతో లయనిస్తూ పాడుతున్నాడు.

పైస తమాషా చూడర బాబూ.
ఏమి లాహిరిగా నున్నది చూడు
ఏమి తమాషా లున్నయి చూడు
కాశీపట్నం చూడర బాబూ
కలకలలాడే గంగానదిని
కన్నుల కలువుగ చూడరబాబు
హరిశ్చంద్రుడు సత్యం కోసం
ఆలి బిడ్డలను అమ్మిన చోటు
అదు గదు గదుగో విశ్వేశ్వరుడు
హార హార హార యను భక్తుల చూడు
చూచి మోక్షం పొందర బాబు ॥ పైస ॥
హస్తినాపురీ పట్నం చూడు
పాండవులేలిన పట్నం చూడు
తాజమహలును చూడర బాబు
కృష్ణదేవరాయలని చూడు
బెజవాడలో కనకదుర్గను
భద్రాచలములో రామదాసును
కన్నుల పండువుగ చూడర బాబూ
చూచి జ్ఞానం పొందర బాబూ

# ౯౧ కోతికి బుద్ధులు

— వీధులు వదలి సందులలో ప్రవేశిస్తాము. ఆయింటిముంగిట ఏదో సందడి. ఆవాడనుంచి పోతే గృహిణులందరూ లేచిపోతారు. ఈవాడనుంచి ఏమీ ఎరగనట్టుగా పదండి. ఎరుకలచిన్నది కోతిని తెచ్చినది. కోతి ఏవో పనులు చేస్తున్నది.

పతివ్రతాధర్మంబు భక్తిగాసలిపి
అతనిచెంపమీద అంటిస్తూవుండు
మగనితోనీకసలు మైత్రిసరిపడక
పగదానివలె మీద పడజూడెతల్లి
అత్తమామలతోటి అనువుగాకుంటె
క్రొత్తముగ్గులుపెట్టి కుంగదియ్యావె
సేవచేయించుకో చిన్నత్తచేత
బావగారిని నీదు బానిసగజూడు
మరదుల నట్టిట్టు మన్నించబోకు
యిరుగు పొరుగులతోటి యిచ్చకములాడు
అంపకము లానాడు అడగవచ్చితే
కొంపగదలక కోపించుకోవే
పెద్దలు నిన్నొచ్చి పిలువ జూచితే
పెద్దపెట్టునగోల పెట్టిఆటాడె
ఏకువలె మెత్తంగ నెరుగనట్టుండి
మేకురీతినిబిగిసి మేలుకొనియుండు
కయ్యంబులకు ముందు కాలుదువ్వుచును
పొయ్యికడకేబోక బుద్ధిగలిగుండు
అంకినవాడికి అమరజూచుకొని
జంకుచెందక బార జూచిపోరాడె

# ౯౨ గౌరి కల్యాణ వైభోగము

—వీరిద్దరూ మెడలకు గంధ ప్రభాత, కొప్పు నిండా పూలతో వియ్యపురాండ్రు. ఆ పసుపు బట్టల జంట నవవివాహితులు. ఈ దంపతులకు ఆశీర్వాదమూ బహుమానమూ కోరుకున్నారు వియ్యపురాండ్రు.

గౌరి కల్యాణ వైభోగమే
లక్ష్మి కల్యాణ సౌభాగ్యమే
పెళ్లి పెళ్లన్నాడు పెరుగూ తున్నాడే
కన్నమ్మ బాసాలు కదల మన్నాడే || గౌరి ||

వోలేది హంకేది వోపెళ్లి కొడకా
వొడికట్టు బియ్యమేవి వోపెళ్లి కొడకా || గౌరి ||

మాబాబు గడ్డాము బవిరి గడ్డాము
యీనుండా పేలుండా ఈతముల్లుండా || గౌరి ||

అవిరేణి కుండలకి అంచులే లేవ్వూ
పెళ్లి కొడుకు అబ్బాయికి పెదవులే లేవు || గౌరి ||

# ౭౩ పల్లెవాని స్వీయ చరిత్ర

—వీడెవడు ? వీపునవల, నెత్తికి సన్నగా అల్లిన తాటాకు టోపీ, చేతిలో మురికి సంచీ !

నేను; పల్లోళ్ల, కుఱ్ఱోణ్ణి బాబు;
నన్ను; కొట్టొద్దు, తిట్టొద్దు బాబు;
నేను; దోసేది, బుఱ్ఱ సంగడి బాబు;
నేను; యేసేది, ఇసురు వలబాబు;
నాను; పుట్టింది, పూలపల్లి ప్రుంత;
నాను; పెరిగింది, పెద పూడి సంత;
నా; బాబు పేరు, జల్లకొంకు బాబు;
నా; అమ్మ పేరు, మట్ట గిడప బాబు;
నా; చెల్లెలు పేరు, చేదు పరిగె బాబు;
నా; తమ్ముడు పేరు, రొయ్యి పీసు బాబు;
నా; పెళ్ళం పేరు, యిసుక దొందు బాబు;
నా; పేరు, బొమ్మిడాయి బాబు ॥ నే ॥

ఆ సంచిలో ఈ చేపలున్నవి కాబోలు. వీడు ఎక్కడో కొత్తవాడు ఎప్పుడూ చూడలేదు.

---

# ౯౪ ఎంతో బీదవాడే

—ఆలోగదిలో ఏదో పాట వినబడుతున్నది. వినవండి త్వరగా. ఓహో. సాతాని జియ్యరులు. వెడల్పైన ఎర్రంచుల తెల్లధోవతులు, వంటినిండా నామాలూ, తలపైనముసుగు నుదుటిచుట్టూ తిప్పినకొంగూ, చేతిలోతాటియాకు విసనకఱ్ఱ, తలమీద గుమ్మడిపండువంటి రాగిపాత్ర! చూడవలసిన వేషము! అదిగో తిరిగి అదేపాట పాడుతున్నారు. రండి విందాము.

ఎంతో బీదవాడే వేణుగోపాలుడు ఎంతో పేదవాడే
ఎంతో పేదగాకుంటే అలనాడు కుచేలుని
అటుకులకు చెయిజాచునా ॥ వేణుగోపాలుడు ॥
కట్టవస్త్రమె యుంటె కౌసల్యతనయుడు
నార చీరెలు దాల్చునా ॥ వేణుగోపాలుడు ॥
ఎక్కగుఱ్ఱమె యుంటె యశోదతనయుడు
పక్షివాహన మెక్కునా ॥ వేణుగోపాలుడు ॥
పండమంచమె యుంటె పంకజనాభుడు
పాముపై పవళించునా ॥ వేణుగోపాలుడు ॥
ఉండయిల్లే యుంటే పుండరీకాక్షుడు
కొండనెత్తుక దూరునా ॥ వేణుగోపాలుడు ॥
క్షీరసంద్రమేయుంటే శౌరి పొరుగిండ్లకు
పోయిపాలు త్రాగునా ॥ వేణుగోపాలుడు ॥

చమత్కారంగా వున్నదిగదూ. అదుగో ఆయింటివారేమో అంటున్నారు. పాడవలసిన జియ్యరులు వింటున్నారు మనముకూడా విందాము.

## రా॥ గొల్లవారము

గొల్లవారము సద్గురుని సేవ కలవారము
చీకటికోనలోన చిట్టడవి మేసేపశువుల
చిత్తమందున దొడ్డికట్టి చెదరకుండా మందతోలే॥
వరయోగ తిరుమంత్రమును వదలక సేవించేవారికి
... ... ... చల్లలమ్మో ॥ గొల్ల ॥
గోప్యమైనా తిరుమంత్రమను గొడ్డలొకటి చేతబూని
అండగోరండమైన అడవి నరకి దొడ్డికట్టే ॥ గొల్ల ॥
అందమైన బిందెలోన, చెదరకుండా పాలుపితికి
పొంకమైనా అడుపుమీదా పొంగకుండా పాలుకాచే ॥ గొల్ల॥
శాంతమను పాలారబోసి, చతురాక్షరమున తోడూయుంచి
ఆత్మయనియెడుభాండములోనా,అందముగాతైరుదరచే ॥గొల్ల॥
తిరుమంత్రమచు కవ్వముబట్టి, ద్వయమంత్రమనే తైరుతరచి
శరణార్థియను వెన్నదీసి చెదరకుండాముద్దచేసే ॥ గొల్లి
అన్ని విధముల అమరగాచి, వన్నెమీరా నెయ్యిదీసి
వినయమైన విన్నపముతో నిష్టతోనిజగురునిచేరే ॥గొల్ల॥

హఠయోగుల గుప్తతత్త్వాలు గుర్తుకు వస్తున్నవి. వడగళ్ వైష్ణవము భక్తునికి అధికార అర్హతను నిర్ణయిస్తూ సాధనపట్ల కొంతగోప్యతను కోరుతుంది కాబోలు. అందుకేనేమో ఈ పాట ఇళ్లలోనేగాని వీధిలో వినబడకపోవడము.

---

# ౯౬ బసవన్న

—అదుగో బసవన్న. బసవన్న అనంగానే వీరశైవము గుర్తుకు వస్తుంది. నంది శివుని వాహనము. బసవన్న సింహాద్రి అప్పన్న, ఏడుకొండల వెంకన్న, అంశములు పుణికి పుచ్చుకున్నాడు. అప్పన్న అన్నమాట 'అహోబిలుకు భ్రంశరూపమై యుండునా ?

డూ డూ డూ బసవన్నా
డూ డూ డూ యెంకన్నా
యెబువుగారికి దండంబెట్టు
బాబుగారికి భాగ్యం కలిగి
పిల్లపాపలు చల్లగవుండి
పైరుపంటలు గాదులు నిండి
పచ్చగాను పది కాలాలుండి
దానం ధర్మం చేత్తావుండి
యెండిగిట్టలు యిస్తారంట
పైండి కొమ్ములు కడతారంట
పట్టుశాలువ పైనయేసుకు
పదిమందిలో పేరుసెప్పుకు
యింటికొక్కడు యీరభద్రుడు
పంచకొక్కడు బసవేస్సురుడు
చల్లగ వెలసి యెబువులూ వుంటె
కళ్ళవేడుకలు మనకంతాను

గంగెదు దాసు సన్నాయి, శ్రుతి బూరా, బిళ్ళగంటా అతనికి కాపీరైటుగా దఖలు పడ్డవి.

# ౫౭ అధ్యాత్మము

__ఈ రోజుల్లో తాతగారు బియ్యప్రమాణాలు నెత్తిమీద ఉన్నప్పటికీ సృష్టిమాన లేదు. ఏమం టారు? జోగయ్యతాతగారా? ఆ బియ్యము కొన్నాడు సత్రానికి వేయడానికా? నమస్కారం, దండము తాతగారూ.

ధీరుడు విశ్వామిత్రుడు తానయోధ్యకు
శ్రీరాముని జూడవచ్చెను – అని
వారుడై సౌధము జొచ్చెను – ఎదురుగా
గారాజు చనితోడి తెచ్చెను – మునికి
చారు సింహాసనమిచ్చెను – మహా
దారుడై పూజయొనర్చెను – స్వామీ
మీరు వచ్చినయట్టి కారణమది దెల్పు
డీ రాజ్యమైన మీకిచ్చెదనని
ను రాకేందువదన వినవె యీచరితము సుందరవనా ॥

మనసా వాచా కర్మణా మూడుయోగాల సాధన చేస్తున్నాడీ బడుగు బ్రాహ్మణుడు!

---

# నా తాతతో పరిహాసకం

—అదుగో తాత మీద పాడుతున్నాడు గాంధీవాడు. ఆపాగా, మీసము, ఎర్ర నొక్కా, బంగారు బిళ్లల పండా శ్రీరాష్ట్రానికి కాలానికి నేటికీ అజేవేష మితనికి.

తాతో పీతో ముంజికాయమూతో
ఉల్లికోడు ఊతో తాతోయి తాత
తాతోయ్ | మాయింటికిరారో | మాటుంది;
నూవు కూసుంటె; కురిసీల పీటుంది;
నూవు నుంచుంటె; నిమ్మచెట్టు నీడుంది;
నూవు తొంగుంటె; పట్టిమంచం పరుపుంది;
నీ ఆకలయితె; సన్నబియ్యం కూడుంది;
అందులో కొంకాయి; కూరుంది;
నువ్వు నసేను; వల్లకాటి దిబ్బుంది.





# ౯౯ తోడు లేదన్నా

పిల్లల్ని ఆకర్షించటానికి ఈ పాట. వారూ పాడతారు కాని మెచ్చేటి చరణాన్ని. రెండో పాట వినండి.

ఎగిరే జట్కా బండి । నడిచే వొంటెద్దు బండి ।
గ్రుడ్లెట్టు జేసింది । గుఱ్ఱం బండీ ॥ గ్రు ॥
యీమూడు జాతుల కలపుకోని । వ్రూడ బొడిచిన ।
రయిలు బండి । కమురు కంపు బొగ్గునీళ్లు, తోడులేదన్నా ॥
వుడికె తోటకూర । మొలచే చెంచలి కూర
గ్రుడ్లెట్టు జేసింది । గులుగు కూర ॥ గ్రు ॥
యీమూడు జాతుల కలపుకోని । వ్రూడబొడిచిన,
గోంగూర । కమురు కంపు రొయ్యి పీచు తోడులేదన్నా ॥
వుడికె ఉలవ పప్పు । చెరిగే సెనగ పప్పు
క్లెట్టు జేసింది । కంది పప్పు ॥ క ॥
యీమూడు జాతుల కలపుకోని । వ్రూడబొడిచిన
పెసర పప్పు । కమురు కంపు । నేతిబొట్టు తోడులేదన్నా ॥

---

# ౧౦౦ రాజ నిమ్మ పండు

ఇంకా మరొక్క పాటలే పాడుతున్నాడు. అసలు పాట 'రాజ నిమ్మ పండు.' డోలక్ వాయించే వాడు చిరు కట్టెతో తాళము నిలుపుతూ వాయిస్తాడు. అదుగో అదే__

పల్లవి :— రాజన్న రాజో ! నారాజ నిమ్మల పండో !
ఓడెల్తుందో డెల్తుంది ; నారాచ ముద్దుల బావ ।

అ ! ప । రాజ, నారాజ, నారాజ నిమ్మల పండ;
నా అప్పరావు కొండ; నాలేత మామిడి మొగ్గ;
నా అప్పుడు గాచిన నెయ్యి ।
నా నేతిలో ఉడికిన బూరికన్న । నేరుపైన రాజా !
ఓడెల్తొందోడెల్తొంది; నారాజ దేశమెల్లి పోతున్నావా ॥రా॥

౧ చ :— వెళ్లేవాడ వెళ్తావు । ఎన్నాళ్లకు వస్తావా ?
ఇంటి వెనుకల, ఆకుమడి దున్నేల్లు రాజా !
వచ్చిందాక; చూచుకుంటాను ॥ రా ॥

౨ చ :— వెళ్లేవాడ వెళ్తావు ! ఎన్నాళ్లకు వస్తావా ?
ఎడమకాలి మడమ తోటి; తన్నేల్లు రాజా !
వచ్చిన దాక; చెప్పు కుంటాను ॥ రా ॥

౩ చ :— వెళ్లేవాడ వెళ్తావు । రంగంలో దిగుతావు;
ఒకటో నెంబరుగళ్లీ; చల; రెండో నెంబరుగళ్లీ;
చల; మూడో నెంబరుగళ్లీ । కెళితే మళ్లీ రావురాజో ॥రా॥

౪ చ :— దేశము బాగుందా ? ఊరైన బాగుందా ?

అనుచు, అడిగి పిలిపించి । ఆదరణ చేయించి;

ఉడుకునీళ్లు త్రాగబెట్టి । వేపరొట్ట చేతికిచ్చి !

అంత మంది తొలగి । అట్టెపోవు రాజో ॥ రా ॥

ఇది వాస్తవానికి ఓడపాట. నమ్మించిన ప్రియుడు రంగం పోతూన్నప్పుడు పాటకప్ర ప్రియురాలి గుండె పాడుకొనుపాట ఇది.

---

# ౧౦౧ టనానా టంకు చెలో

—గాంధీవాడు ఏల పాటల పుట్ట. శతాబ్దాల వెట్టిమీపి పారిపోకుండా దిగి వచ్చిన బొమ్మకాదు. ఇది లోక వ్యవహారాలన్నిటినీ ఎత్తిచూపుపాట. ఈ వరసని చరణాలు ఎన్నైనా వుంటవి. మచ్చుకుకొన్ని

నామగడు వాడకెళ్లే నాకు తోడు ఎవరులేరూ
కోడికూసే వేళదాకా తోడురారా వన్నెకాడా || టనాన ||
చింతచెట్టు చిగురుచూడూ, చిన్నదానీ యీడుచూడూ
అద్దములో నీడ చూడూ, ఇద్దరికీ జోడు చూడు || టనాన ||
సరసాపురమునుంచి నలిగి నలిగొస్తంటే
తాళ్ల పాలెముకాడ తగిలింది జ్వరమూ || టనాన ||
చంకలోని నీళ్ళకడవా – నీడజూచి నిండ గట్టరి
ఇద్దరికీ యిట్టమయ్తె – ఎవరిదేమి భయ్యామె || టానన ||
ఇంటిమొగుడికి వంటెద్దుబండీ – రంకు మొగుడికి రెండెడ్ల బండీ
మధ్యతిరిగే లాల్ గాడికి – దొరలుఎక్కే మరలబండి ||టానన||
ఇంటిమొగుడికి యీతకల్లు – రంకుమొగుడికి తాటికల్లు
మధ్యతిరిగే లాల్ గాడికి–దొరలుత్రాగే బ్రాండిసీసా ||టానన||
తల్లిపిల్ల నిడిసి యీడు – సేసుకున్న భార్యనిడిసి
దొమ్మరదాని యెంటపోతె – డోలుమెడకు యేసెరా ||టానన||
కల్లు తాగి ఒళ్లుమరసీ కైపుయెక్కి తిరగబోకూ
పెళ్ళిచేసి పంపుతారూ పెందలకడ మేలుకోరా || టానన ||

---

# ౧౦౨ పాండవులు పాండవులు తుమ్మెదా

—ఇది సంక్రాంతి పండుగ దినములలో వరివెన్నులు చేర్చి కట్టి పళ్లెములలో పెట్టి పసుపు కుంకమ అలంకరణము చేసి, మాలెతలు ఇంటింటికీ తిరుగుతూ పాడు పాట.

పాండవులు పాండవులు తుమ్మెదా, పంచపాండవులె
తుమ్మెదా
ఓయి భామల్లాల తుమ్మెదా, భామల్లాల తుమ్మెదా
పండిన వరిచేలు తుమ్మెదా, పాయల్లు తొక్కింది తుమ్మెదా
పట్టండి నందిని తుమ్మెదా, గాణుకందాని తుమ్మెదా
యీనిన వరిచేలు తుమ్మెదా, తమ్మిరాయీడు వెడబిమ్మింది
తుమ్మెదా
పొగతోటలన్నీ తుమ్మెదా, పాడిపాడిగ తొక్కిందితుమ్మెదా
చెరుకు తోటలన్ని తుమ్మెదా, చెడతొక్కివేసింది తుమ్మెదా
యెక్కడెక్కడ వెదకినా తుమ్మెదా, యేడాదినంది తుమ్మెదా
కాపారిచేలో తుమ్మెదా, కట్టిపెడతారు తుమ్మెదా
మాలవారి చేలోకి తుమ్మెదా, వెళ్లనందన్న తుమ్మెదా
మాలవారు మంచివారు తుమ్మెదా, నిన్నుగొలుతూర్రూ
తుమ్మెదా

తుమ్మెదా అన్న పాదాంత పదములతో అంతమయ్యే పాటలు శైవ సిద్ధాంత సంబంధులే ఐనప్పటికిన్నీ, తరువాత ఇతరవస్తువును కూడా ఆకళించుకొన్నవి.

# ౧౦౩ లిల్లేలు పాట

—ఇది సంక్రాంతి పండుగ కనుము పోయిన, మాదిగ కులంవారు గ్రామంలో సొమ్ము దండుకోటానికై, ఒక కావిడి, తప్పెట్లు, వేసుకొని, ఒక లిల్లేలు పాటపడుతు, కాళ్లకు గజ్జెలు, మొలపట్టి, కట్టె లిల్లేలు కత్తి భుజంమీద వేసుకొని, ఆగుంపులో కొందరు డబ్బులు వాయిస్తూ, వంత పాటపాడుచుండగా పాడుపాట.

లింగ; తా! లిల్లే: తా లిల్లే !
తాం; తత్తార పడకుండ; తానె బ్రహ్మము || లింగ || తా ||
ఓరి; ఆది మూలము, బ్రహ్మ, విష్ణు విగ్రహము మీద !
ఆనంద మాడే వాడెవడురా ?
అఖిల దేవతలకు । అభయ మిచ్చు వాడు !
అలనాడు గోసంగు । నే నేనురా || లింగ || తా ||
పసుపు గంధము చాల । పై నిండ బూసుక !
మిసిమి కత్తి సిచేత । మేల్ బూనంకొని !
మేల్, మేల్ , సలిపిన । మేటి మృగముల కెల్ల !
నాకత్తి సయ్యాట । లాడునురా || లింగ || తా ||
మింటి దిక్కును జూచి । మీసంబు వడివేసి !
కొంటె దున్నతల । నరికేనురా !
గొంకక చిందులు । గోవింద గంతులు !
శంకలేక బలి । చల్లితిరా || లింగ || తా ||
అండాండ మనుబిరుదు । డాసాదినా పేరు !
పిండాండ మను । బిరుదుకాసె పోసి !
అండ పిండ, బ్ర । హ్మాండముల కెల్లను !
మెండుండుదై బాలకు । మెండాడురా || లింగ || తా ||

గోసంగులు బ్రహ్మనాయని సేనలోని మాదిగలు. మాదిగవారు వీరశైవులు. శివరాత్రి నాడు కోటి ఫలక్షేత్రములో వీరి డప్పుల వాద్యాలతో చెవులు గళ్లు పడును.

# ౧౦౪ నాగుల చవితి

__ఆంధ్రులకును నాగులకును విడిపోని చెలిమి. అమరావతి శిల్పములలో నాగముల వంటి తలపాగలు విరివిగా కనపడును. మధ్య భారతపు బార్హుతు శిల్పాలలో కూడా తలపాగలు కనపడును. అయితే ఆతరువాతి సాంచీ, అమరావతీ నాగార్జునకొండ చిత్రములలో విరివిగా కనపడుటను బట్టి తలపాగా తెలుగువారి అభిమాన ప్రత్యలంకరణమున వచ్చునేమో.

ఈ పాటలు పాములకు సంబంధించినవి. క్రూరప్రాణి అయిన పామును కూడా ఆప్తులలో చేర్చుకుని పాటలు పాడడము వినోదకరమైన వింత.

ఇది జోల పాటలలోనిది.

నాగస్వరం, పాడితే । నాగులకు నిద్ర
పుట్టలో నుంటేను । భూములకు ముద్ర
అమావాస, పున్నాల। మనగలే సుద్ద
పాటి మీదాకొస్తే । కత్తి కట్టేను
బూకరించుచు । పడగ బుస్స కొట్టేను
గుడిలో నాగులు । కొల్చిన దేవుడు

## ౧౦౩. నాగుమయ్య ఉనికి

—ఈ పాటలో పాముల ఉనికి చెప్పబడింది.

పిల్లలందరుగూడి పుల్ల లేరబోతె
పుల్లల్లొ వుండేటి ఓపుల్లనాగ ॥

ఇల్లలికి ముగ్గెట్టి మల్లెలు విరజల్లి
మల్లెల్లొ వుండేటి ఓమల్లినాగ ॥

గొల్లభామలుకూడి చల్లలు చెయ్యంగ
చల్లకుండ కింద చల్లనాగయ్య ॥

ఇవతల యిదికొండ అవతల అదికొండ
నట్టనడుమను కొండ నల్లతాచయ్య ॥

అనుభవానికి చక్కని వర్ణన. ఈ పాటలలో ఈ గుణము సర్వత్రా కనపడుతుంది.

# ౧౦౬. నాగుమయ్య

—ఇది నాగ పూజను గురించిన పాట. తొలియుగాలలో భయంకర వస్తువులన్నీ — రుద్రునివలె — దేవతాంశము కలవిగానే పరిగణించినాడు ఆదిమ మానవుడు. నాటి నుండి నేటికి దిగివచ్చిన నమ్మకమున కుదాహరణమీ పాట.

ఉసిరిగ చెట్టు కింద పసరిగ పాము
కూనమూడ్చి పాము పడగ బుస్సంది
పామునన్నూ చూచీ పడగనెత్తింది
పడగలెత్తకు పాము పగవారముకామూ
పడగెత్తి దూసింది నాలుకలు రెండూ
నాలుకలుదూయకే నీవారము నాగూ
మంచినాగూవైతె పంచలెట్టేము
కోడెనాగూవైతె కోకలెట్టేము
పడగలెత్తకునాగు పగవారముకాము
మాచేను పండితే చలిమిడేసేము
మా నువ్వులు పండితే చిమ్మిలేసేము
నాలుకలు దుయ్యకే నీవారమునాగూ
మాపత్తి పగిలితే పంచలెట్టేము
మాయావులీనితే పాలుపోసేము
పడగ లెత్తకు నాగు పగవారముకాము
నీపూజ చేసేము నీకు మొక్కేము

# ౧౦౭ పాము మంత్రము

—ఇది పాము మంత్రమునకు సంబంధించినట్లు కనపడుతున్నది. పాము సౌందర్యాన్ని చూడండి.

నాగా దిగురా ।
నాతండ్రి దిగరా । నాగన్నదిగురా । నాగాదిగురా ।
దిగుదిగు నాగన్న దివ్య సుందరనాగ
నల్ల చుక్కలనాగ నాముద్దునాగా ॥ నాగా ॥

నవనవ లాడేటి నల్లచుక్కలనాగ
తళతళ లాడేటి తెల్ల చుక్కలనాగ
పసిమి పొరలుగల పచ్చన్నినాగా ॥ నాగా ॥

కొండ చిలువలకెల్ల కోర్కెతో రాజువై
పరుగుడు పాములకు ప్రభువువైరంజిల్లి
మొగలి చెట్లపైని మసలి తిరుగులాడి
పాలు ఆరగించు పచ్చన్ని నాగా ॥ నాగా ॥

పశ్కాను పదివేను మచ్చాలుగలవాడ
గురివింద పూసల కళ్ళయిన గలవాడ
పరికి ముళ్ళవంటి పళ్ళుగలవాడ నాగాదిగురా ॥

# ౧౦౮ నాగదేవుని పాట

—ఆరడుగులు కలిసివేస్తే ఆప్తులవుతారట. చేలలో తిరుగుతూ చేను చెడిపే ఎలకలను పట్టిమింగేటి పాము ఆప్తవర్గములోనిదే. నాగన్నకు సలహా యిస్తున్నది గృహిణి.

పుట్టలోనాగన్న బూచినాగన్న
ఎండలో పడుకోకు వెరినాగన్న
కలిగినోరి కోడళ్లు గర్వావంతూలు
కలాపిజల్లేరు కాళ్ళుచిమ్మేరు
ఎంగిళ్లుజల్లేరు భంగవుచ్చేరు
అటుబోకు నాగన్న చాకిరేవులకు
చాకిరేవులలోన చేరిపడుకుంటె
సాలిపరుగుడని సంపేరునాగు
అటుబోకునాగన్న చెఱుకుపొలములకు
చెరుకుపొలములలోన చేరిపడుకుంటె
నల్లచెరకు అని నరికేరునాగు

## ౧౦౯ గడికోపు

—ఈ నాలుగుపాటలూ కేవలము వినోదములోపుట్టి వినోదమునకు దారితీశేటివే.

తానతందానతాన, తక్కిడీ తందానతాన

పచ్చపచ్చని పక్షియొక్కటి, నడినెత్తిని రెక్కలొచ్చె
చేతులాను గోళ్లువచ్చె, చెవులనందున కొమ్ములొచ్చె॥

దాని పచ్చిమాంసమును, కత్తిపీటన కోసికోసి
బ్రాహ్మలనక బంటులనక, బంతినీ భోంచేసిరంట॥

ఎంతచెప్పిన వేదశాస్త్రం, తెలియదాయెను దానిభావం
దానిభావం బట్టబయలు, దానిపేరే అరటిచెట్టు॥

సందెకాడ లగ్గమాయె, సానిపొత్తు గర్భిణాయె
తెల్లవారగ పిల్లతల్లి, పొద్దుపొడుపుకు పేరుకొచ్చె ॥తా॥

ఎంతచెప్పిన వేదశాస్త్రం, తెలియదాయె దానిభావం
దానిభావ బట్టబయలు, దానిపేరే పెరుగుకుండ ॥తా॥

ఇంటివెనక కుప్పవేసె, కుప్పకాల అప్పుతీరె
ఎంతచెప్పిన వేదశాస్త్రం, తెలియదాయె దానిభావం
దానిభావం బట్టబయలు దానిపేరే కుమ్మరావం ॥తా॥

ఇది తకిటకిటతక అని ఏడక్షరాల ఆవృతాలతో నడుస్తున్నది. కోపులన్నవి సాధారణముగా నాలుగక్షరాల ఆవృతాలతో నడుస్తవి.

# ౧౧౦ పొట్టేలు

పొగరెక్కి పొట్టేలు పొడిచేయునోపిల్ల
తొగరుచీరపిల్ల తోవలో లెగులెగు
పచ్చగట్టుమేసి వక్రించినదికొమ్ము
మచ్చికదనుకోకు మార్గాన లెగులెగు
బొచ్చుమెడ చిరుగంట బురణించి రవణించు
ముందంజవేయకు పుంతలో లెగులెగు
కచ్చపోసినపిల్ల కాలందెఘులపిల్ల
వచ్చుచున్నపిల్ల వయ్యారిపిల్ల

# ౧౧౧ గొర్రే గొర్రె

పొట్టేళ్ల గన్నతల్లి గొర్రేగొర్రె
దున్నపోతును గన్నతల్లి బర్రేబర్రె
వుమ్మెత్త కాయతింటె వెర్రేవెర్రె
మిరపకాయ నమిలితేను వర్రేవర్రె
కాకిరెట్ట బట్టమీద కర్రేకర్రె
బురదలోను కాలేస్తె పుర్రేపుర్రె
ముందటి పండ్లూడితేను తొర్రేతొర్రె
తొర్రెనోట్లొ అంబలేస్తే జుర్రేజుర్రె

“చద్దీవణ్ణం వుల్లిపాయా జుర్రోజుర్రో, దానీ మొగుడు దాన్నీ కొడితే మొర్రోమొర్రో” అన్న పాటలా గున్నది ఇది.

# ౧౧౩ చీకటిలోన

—ఈపాట పైదానికి అనుకరణవలె కనపడుతున్నది. కాని దీని సొగసు దీనిది.

చీకటిలోన వానచినుకు చిటాపటా
ఆకుచాటు ఆడపిల్ల చటాఫటా
పూతపూచె బొండుమల్లె గప్‌చిప్
కోతకొచ్చె గొడ్డుమావి చల్‌చల్
వేళగాని వేళవచ్చి చిర్‌బుర్
మేలమాడి నవ్విస్తాడు బల్‌బల్
కోడెవాడు కొంటెవాడు ఆంయి ఆంయ్
రానిదాన్ని రమ్మంటాడు సంయ్‌సంయ్

## ౧౧౩ హైలాస

పడవలరేవు సొగసైన కూడలి. పడవ ప్రయాణము ఒడిదుడుకులు లేని సాఫీ ప్రయాణము. కళాసీలకూ సరంగుకూ మాత్రము పడవపని చికాకైనదే. సామాన్యముగా ప్రయాణము రాత్రి పూట. పగటి పూటలోనే వారికి నిద్ర. కనుక వారి జీవితానంద మంతా పడవపైననే సాధించుకుంటారు వారు. వారి పాటలలో కామదేవుడు విచ్చల విడిగా విహరిస్తుంటాడు. నడేటికి పోతే వారిదే రాజ్యము. అలలూగాలీ తోడైతే చెప్పనే అక్కరలేదు.

హైసా, హైలాస అన్నవి పడవను బలముగా నీటిలోనికి నెట్టవలసి నప్పుడు వారు పాటలలో ఉపయోగించే ఊతపదాలు. నలుగురూ చేరి వీపులు పడవకు దాపుపెట్టి నెట్టితే నాలుగు సెకనులలో పడవనీటిలోకి జరుగుతుంది. ఆ నాలుగు సెకనులలోనే పాట పూర్తి కావాలి.

పెళ్ళి కూతురు చూడు హైలాస
బహు పెద్ద మనిషిరా ,,
చూసి రమ్మంటేను ,,
చేను కొచ్చిందిరా ,,

గంగ గౌరమ్మ హైలాస
గంగమ్మ ,,
దండాలు మాతల్లి ,,
కొలుపులు మాతల్లి ,,
కొండల్లో మాతల్లి ,,
దిగిరావె మాతల్లి ,,

చేయెత్తి దణ్ణమ్మో    హైలాస
గంగమ్మో దణ్ణమ్మో    ,,
కనిపెట్టు మాతల్లి    ,,

అంతరాల పడవ మీద హైసా
అందిపూలు కొయ్యబోతె హైసా
కొమ్మతూగి కొప్పు నిండు హైసా
లేనిపోని రవ్వ లొచ్చు హైసా

కొమ్మదూగి కొప్పునిండుట ఈ జానపదగేయాలలో అతి సాధారణము. 'లేనిపోని రవ్వలు' పెనిమిటి దండింపులు.

---

# ౧౧౪ ఐలేసా

ఏలియాలా ఏలియాలా
ఏలియాలా ఏలియాలా
ఐలేసా జోరుసెయ్యి
ఐలేసా జోరుసెయ్యి

అయిల పట్టు ఐలేసా, బల్లకట్టు ఐలేసా
అద్దిర బాబు ఐలేసా, అక్కడ పట్టు ఐలేసా
సాపసుట్టి ఐలేసా, సంకనెట్టి ఐలేసా
సందమామ ఐలేసా, అందముగా ఐలేసా
ఐలేసా జోరుసెయ్యి, ఐలేసా బారుసెయ్యి
సన్నజాజి ఐలేసా, సీరకట్టి ఐలేసా
పొన్నపూలు ఐలేసా, అహ కొప్పునెట్టి ఐలేసా
సిన్నదొచ్చి ఐలేసా, కన్నుగీటె ఐలేసా

వేదము వెంకటరాయశాస్త్రిగారు "జోర్సెయ్ బార్సెయి" అన్న పాదాంత ప్రదాలతో కొన్ని పడవ పాటలు రచించినారు. వానిలో సొగసుకత్తె ప్రశంసలేదు.

---

## ౧౧౫ జాలుమాలి

జాలుమాలి జాలుమాలీ
జాలిరవో బేడిబిల్లా
కాకినాడ రేవులోను జాలుమాలి
జోడుకొయ్యల వోడవచ్చె జాలుమాలి
వోడమీద సిన్నవోడ జాలుమాలి
యేళ్ళనిండ వుంగరాలు జాలుమాలి
వుంగరాల సెయ్యిసూచి జాలుమాలి
వుండదేర ముండమనసు జాలుమాలి

ఈ పాటలో ‘జాలుమాలి’ అన్న పదమును కళాసీలందరూ చేరి పలుకుతారు. మాటలు పదము చెప్పేవాడు చెప్పుతుంటాడు. ఈ పాటలో కథ అల్లిక కనబడుతున్నది. పడవను విడిచి పాట ఓడ్లనుపట్టినది. ఓడలో ప్రయాణీకులు పెక్కురు.



## ౧౧౬ భీమరాజుపదము

—వారిలో భీమరాజు ఒకడు. భీమరా జెట్లాంటివాడు ?

వాడమీద వన్నెకాడో భీమరాజు
వాసనకి సంపెంగవనమూ
చేతినిండవుంగరాలో భీమరాజు
చెప్పరాని చక్కదనమూ ॥వా॥
కాయపంచెలు కట్టుకొని భీమరాజు
కిర్రుచెప్పులు తొడుగుకోని
కర్రచేత బట్టుకోని భీమరాజు
కలకటేరులాగొచ్చేను ॥వా॥
కాకినాడ రేవులో భీమరాజు
కేవుగట్టి వోడఎక్కి
రంగురంగుల బావుటాతో భీమరాజు
రంగుసేసి రంగమెల్లే ॥వా॥

---

# ౧౧౭ నారాయణమ్మ

—రంగముకెళ్ళే కూలివాళ్ళు నేటికీ చాలామంది ఉంటారు. రంగములో కూలి ఎక్కువ. కాబట్టి కూలీలు తరుచుగా పోతుంటారు. వారిభార్యలకిది కష్టకాలము; చెలిమికత్తెలకింకా ఎక్కువ. ఇది ఒక జంట సంభాషణ.

నేరంగమెల్లిపోతానే నారాయణమ్మ
నేను నబ్బరెల్లిపోతానే నారాయణమ్మ
నువు నబ్బరెల్లిపోతేనూ నాయుడుబావ నీ
యబ్బనాకు తోడెవరూ నాయుడుబావ
రంగమెల్లిపోతేనూ నారాయణమ్మ నీకు
రంగుసీరలంపుతానే నారాయణమ్మ బల్
సిలుకు సీరలంపుతానే
సీరలు సారెలుగట్టి నాయుడుబావ నే
నోరితోను కులుకుతాను నాయుడుబావ.
పదిరాళ్లుతెస్తాను నారాయణమ్మ
మనమిద్దరము కులుకుదాము నారాయణమ్మ
నన్నిడిసిపోకోయి నాయుడుబావ మన
కిద్దరికిజోడోయి నాయుడుబావ

ఇది సాగనిమోర. సొమ్ముచాలకనో నారాయణమ్మపై మోజుచాలకనో నాయుడుబావ రంగము వెళ్ళిపోతున్నాడు. ఆఖరి క్షణములో ప్రయాణము ఆగబోతుందా ?

---

## ౧౧౮ చెంచు

—నాయుడు కన్నాగడును వాడీ యువకుడు. ఇక్కడి విలాసములు చాలక వెంగళు పోతున్నాడు. పలికే మాటలు మాత్రము ఇవి.

మళ్ళీ వచ్చిందాక మర్లా మరవనంటా
శేతులో శెయ్యేసి శెప్పిలె శెంచు జోర్న్యాయ్

కూడొండి పెడతాను గుడ్డలికి పెడతాను
కూడాతోడ కపోవా జోడుగా మావా ?
నీమణుచు నామణుచిరకూ దప్పాకుంటే
యెడబాసి నెలవుంటె నేమోలే శెంచు జోర్న్యాయ్

ఏపూర నేపల్లె దేనిమీ కన్నె శినవో
యెంటా నన్రానీవు తుంటారి మామా జోర్న్యాయ్

కోకా జరీతెస్తా కొప్పూ బిళ్లాతెస్తా
నవ్వాతా శెలవిచ్చి నన్నంపే శెంచు జోర్న్యాయ్

కోకా జరీవొద్దు కొప్పూ బిళ్లావొద్దు
రానీ వానీ తోటి కానీవో మామా జోర్న్యాయ్

శెంపాముద్దెట్టుకొని శెల్లోబాయ్ యెడవకు
అల్లాడే సారంగు యెల్లిపో శెంచు జోర్న్యాయ్

# ౧౧౬ ఓ డెల్లి పోతున్నది

—పాపము ఆ చిన్నది ఏమిచేయగలదు. ఓడ కంటికి కనబడు నంత వరకూ ఏడుస్తూనే ఉన్నది.

ఓడెల్లి పోతున్నది మారాజో ఓడెల్లి పోతున్నది
చెన్నాపట్నం రేవులోన చెట్టా పట్టా లేసుకొని
చెవిలో గుసగుసలేమో చెప్పిపోయిన మారాజో   ఓడెల్లి

కాకినాడ యాదుల్లోన కాటుక కన్నుల జూచి
కన్నీళ్ళుచేత తుడిచి కనికరించిన మారాజో

నీవంద కత్తెవాని నిలువూట ద్దానచూచి
నీడజూచి మురిసిపోయిన నీటుగాడవు మారాజో

భీముని పట్టాములోన పిన్నపెద్దలందరుజూడ
పెద్దాపందిరిలోన పెళ్ళాడిన మారాజో

కంచంలో బువ్వెట్టుకొని కమ్మని వెన్నెలలోన
కసిగాటు కొట్టుకొంటూ కలవరించిన మారాజో

అందమైన నీమోము చందురూని చూస్తూంటె
గుండెచల్ల బడతాదాని గున్నిశాడిన మారాజో



# ౧౨౦ సిరిసిరి మువ్వ

—రంగము పోవటము, సొమ్ము చేరటము రంగసాని చేశమిచేయటము, సొమ్ము చేయి జారటమూ అయినవి. సముద్రాల కట్టపైపున ఉన్నచిన్నది గుర్తుకు వచ్చినది.

జోడుకొయ్యల వాడమీద—సిరిసిరిమువ్వ
జోడగ్గిపెట్టె లంపినానే—సిరిసిరిమువ్వ ॥
అది అందిందో లేదోనె—సిరిసిరిమువ్వ
నాకు తిరుగుజాబు లంపలేదే—సిరిసిరిమువ్వ ॥
మూడు కొయ్యల వాడమీద—సిరిసిరిమువ్వ
నీకు ముక్కుపుడక లంపినానే—సిరిసిరిమువ్వ ॥
అది అందిందో లేదోనె—సిరిసిరిమువ్వ
నాకు తిరుగుజాబు లంపలేదూ—సిరిసిరిమువ్వ ॥
నాలుగుకొయ్యల వాడమీద—సిరిసిరిమువ్వ
నీకు నానుకోడు లంపినానే—సిరిసిరిమువ్వ ॥
అది అందిందో లేదో—సిరిసిరిమువ్వ
నాకు తిరుగుజాబు రాలేదు—సిరిసిరిమువ్వ ॥
అర్ధరూపాయి డబ్బులకు—సిరిసిరిమువ్వ
నువ్వాశపడా బోకంది—సిరిసిరిమువ్వ ॥
అనుపత్రి పాలైతే—సిరిసిరిమువ్వ
నిన్నాదుకోనే వారు లేరంది—సిరిసిరిమువ్వ ॥
కసరి కసరి కొడితేను—సిరిసిరిమువ్వ
నేసరసమనుకున్నానే—సిరిసిరిమువ్వ ॥

కంటికి కాటుక బెడితే—సిరిసిరిమువ్వ
నేను కన్నె అనుకున్నానే—సిరిసిరిమువ్వ ॥
సైట పావడా గడితే—సిరిసిరిమువ్వ
నే-పడుచు అనుకున్నానే—సిరిసిరిమువ్వ ॥
పౌడరేసు కుంటేను—సిరిసిరిమువ్వ
నేను—బాలికనుకున్నానే—సరిసిరిమువ్వ ॥
తళుకు జూపిస్తేను—సిరిసిరిమువ్వ
నా-వలుపులనుకున్నానే—సిరిసిరిమువ్వ ॥
నీమీద వలపంటే—సిరిసిరిమువ్వ
కామాలునను కున్నానే—సిరిసిరిమువ్వ ॥
సంకురాత్రి పండుగనాడు—సిరిసిరిమువ్వ
నేను—సారానీళ్ళు త్రాగబోతే—సిరిసిరిమువ్వ ॥
ఒంటిగా నుంటేను—సిరిసిరిమువ్వ
నా—కొక్క చుక్కదిగలేదు—సిరిసిరిమువ్వ ॥
కష్టపడ్డ డబ్బంత—సిరిసిరిమువ్వ
ముండ—కాటిమీద బెట్టినానె—సిరిసిరిమువ్వ ॥
ముద్దు గుమ్మనేడిపించి—సిరిసిరిమువ్వ
పాడు—ముండలకు బెట్టినానె—సిరిసిరిమువ్వ ॥
సముద్రాలు దాటిపోతే—సిరిసిరిమువ్వ
పై-సాయైన లేకపోయె—సిరిసిరిమువ్వ ॥
బుద్ధిలేక రంగమెళ్ళి—సిరిసిరిమువ్వ
ఖారద్దిపాలు బడ్డానే—సిరిసిరిమువ్వ ॥



# ౧౨౧ పడవపాట

—ఈ తెప్పపాట రచన యేమోననిపిస్తున్నది. కాని దీని నిచ్చిన మిత్రులు కోటిఫలిలో పడవవానికడ రానుకున్నానని చెప్పినారు. అందంగా ఉన్నది. "రవ్వమువ్వలతెప్ప రవగాలిలోకి వెళ్లినదట.

పల్లవి :— గట్టెకు తాదా! నాతెప్ప
కల్లోల జలధిలో మునిగిపోతుందా ॥ గ ॥

కొక్కురో; కోయంచు । కోడి గూయంగానె;
దేవుడిచ్చిన నిద్ర । తెలిసిందిరాయంచు;
చలిగాలిలో వళ్లు । సవరించుకొంటు
చద్ది గట్టు కనేను । చక్కవచ్చాను ॥గ॥

చల్లన్ని గాలిలో । మెల్లంగ వెలిగేటి,
చంద్రయ్యనే జూచి । సంద్రమే పొంగింది,
పొంగేటి కెరటాలు । వంగుతూ; వాలుతూ,
రవ్వమువ్వలతెప్ప । రవగాలి కెళ్లింది ॥ గ ॥

పదిగుళ్లవలదీసి । పారజూస్తే, తెప్ప
పొంగినా కెరటాలు । బొబ్బలెట్టాయి
కారుచీకటి గ్రమ్మె । కళ్లకు పస్తయ్యె
సరిగపోయేతెప్ప । గిరగిరాతిరిగింది ॥ గ ॥

గాలిజోరుచూచి । కల్లోలమేచూచి
కుదురులేని గుండె । కొట్టుకోసాగింది

చుక్కాని తిప్పుచు । శోకాన మునుగుతూ ।
అంతు, పంతూలేని । ఆనీటిలోనుండి ॥ X ॥
ఇంతలోనే యిల్లు । యింటిపిల్ల నాకు
జ్ఞప్తిరాగా వల్లు । గలగలా లాడింది
యింటి పిల్లింక, నా । కంటపడతాదా
సరసాలతోనేను । మురిసి పోతానా ! ॥ X ॥
పొమ్మంటె పోతుంద ? । రమ్మంటె వస్తుంద ?
రంగడి దయలుంటె । కంగారుపడనేల ?
గాలిలోనేనింక । కూలినా సరెగాని;
రంగడే మాయోడు । రంగడే దొంగోడు ॥ X ॥
మనసు కలిసినవారి । మనసులోకటల్లేను
కుటిల మెఱుగని బొబు । గుండె కాయల్లేను
మబ్బులన్నీ దాటి । మారాజు సూరయ్య
గప్పు గప్పూ మంటూ । గంతేస్తు వచ్చాడు ॥ X ॥
పొంగుతూ వలదీసి । బుంగనిండేదాక
చేపలేరుకనేను । చెంగున గట్టెక్కి
నావ కట్టిబెట్టి । నాయింటి కెళ్లాను
పిల్ల కంటబడితె । వల్లు చల్లాగుంది
(గట్టెక్కినాది, నాతెప్ప । కల్లోలిజలధిలో కడతేరినాది)

# ౧౨౨ మంచెదిగవే

ఏలలు అన్నవి నిర్ణీత ఛందో నిర్మాణము గల పదములు. యౌవనానుభవమును సూచించే భావాలున్న పదములను ఇక్కడ ఏలపాట లంటున్నాము. ఈ అర్థముతో 'ఏలపాటలు' అన్నమాట వాడుకలో నున్నది. వీటి ఛందము మాత్రము ఏలల ఛందముకాదు అయినప్పటికిని 'వీధిబోయెదు ప్రౌఢ విటుడుపాడెడు వింత, ఏలపదాలట్టె యాలకించు' నన్న కదిరీపతి పలుకులు ఏలపాటల కీయర్థమునే సాధించుచున్నవి.

ఏలపాటలలో పడుచువాండ్ర భావాల ఛాయలన్నీ కనబడుతాయి. పండిత వాఙ్మయములో ఇవి అరుదు.

—యదాలాభముగా చూచినపడుచును కికురిస్తున్నాడు యువకుడు.

ముద్దూమొగమూదాన ముక్కూపోగూదాన
కాకివేషముదాన కామంచి పడుచా
మంచెదిగవే ||

అటుక చేనూలోన ఆవ్రాలున్నవి భామ
అలమందానన్న అదలించరావే
మంచెదిగవే ||

కొఱ్ఱ చేనూలోన కోడెలున్నవి భామ
కోడె మీదానైన కోపించరావే
మంచెదిగవే ||

రూమాలమూటలో రూకలున్నవి భామ
మంచెకిందికి రావె పంచుకుందామూ
మంచెదిగవే ||

# ౧౨౩ పంచవన్నెల సిలక

—ఇటు వంటిదే ఇంకొకపాట. ఈ పాటలో చిన్నది జవాబిస్తున్నది. అయితే ఆక్షేపణము కాదు. ఆమెను పలికిస్తున్నది; అచ్చెరువు!

మంచెదిగవే పాంచాల సీలకా మంచెదిగవే
మంచెదిగవే ఓ పంచవన్నెల సిలకా
వొంచీన తలయెత్తి వాలూసూపులుసూసి
మంచెదిగవే పాంచాల సిలకా ॥ మంచెదిగవే ॥
సేబాసు కురవాడా సెవులాపోగులవాడ
మాబావ కన్నవిన్న మరియాద దక్కునా
మంచె దిగనూ నేను కంచెదాటి రానూ ॥ మంచెదిగనూ ॥
అల్లాము బెల్లాము తెల్లాకొంగున కడుదు
తెల్లాకొంగున కట్టి తెల్లవారేసరికి పోదు
మంచె దిగవే పాంచాల సిలకా ॥ మంచెదిగవే ॥
అల్లాము బెల్లాము వల్లాదు నామనసు
అన్నాదమ్ములు సూత్తె ఆచోరు నిలవాదు
మంచెదిగనూ మంచి మురుగులవాడా ॥ మంచెదిగనూ ॥
పూలారై కాదాన వాలూసూపులదానా
కాలులోములుదిగెనూ కాసింతములుతీయే
మంచెదిగవే పాంచాల సిలకా ॥ మంచెదిగవే ॥
కాలిలో ములుదిగితె కత్తి మంగలిగలను
తాలీ కట్టినోడు తాయెత్తు కట్టూను
మంచె దిగనూ పొంచున్నసినవోడ ॥మంచెదిగనూ॥

ఆశ్లీల స్పష్టముగా లేకున్నా నాగరిక రచనలలో కనబడలేదు ఈపాట. విన్నవారి ఆపేక్షను పట్టించుకోవడానికి చిన్నదానిచేత జవాబు చెప్పించాడు జానపద రచయిత.

ఈరకపు పాటలు చెంచునాటకములలోకూడా కనబడుతున్నవి. సింగడు

గుండు దిగనె చెంచీత గుండు దిగవే
వేళ్లకు తగ్గ కనకపు శ్రీమెట్టె లిచ్చేనూ॥

అంటే సింగి

గుండు దిగనూ ఓబులా గుండు దిగనూ
వేళ్లకు తగ్గ కనకపు శ్రీమెట్టె లొల్లనూ॥

అని జవాబు చెప్పేపాటను దొణప్పగారు పేర్కొనినారు. ఈపాటలు వాడుకలో నున్నవే నాటకములలోనికి దిగియుండుననుటే సమంజసమేమో. ఏలలూ, లాలి, జోల, శోభనము; తలుపు దగ్గరపాట, మేలుకొలుపు, ఉయ్యాలపాట అన్నవన్నియును వాడుకలోనున్నవి నాటకములో ప్రవేశించినవి.

---

# ౧౭౪ నల్ల చిన్నదాన

ఏమంచె మీదనోవుండినట్లైతే దిగను పొమ్మని పడుచువానిని తెప్పించుకోగలదు పిల్ల. పొలమునుండి ఇంటికి పోతూన్నప్పుడో ?

ఈ రెండూ తునకలే. మిగిలిన భాగము మాకు దొరకలేదు.

చిన్నదాన నల్లచిన్నదాన
నీ ఊరి పేరేమి ? నీపేరేమి ?
నిజముగా చెబితే
నీ వెంట వొత్తాను నల్లని చిన్నదాన
నాఊరు ఊసేలరా ? నాపేరు ఊసేలరా ?

---

## ౧౨౫. పగడాల ముద్దుగుమ్మా

మెళ్లొ పగడాల దండ ముద్దుగుమ్మా
బంగారుబొమ్మా
నా మెళ్లో పగడాల దండ వూసెందుకూ నా
వొళ్లంతపైనికిండ వూసెందుకూ ?

ఈ పిల్లలకు వెనుక మద్దత్తున్నది, ధైర్యమున్నది.

---

# ౧౨౬ చంద్రి - బాలయ్య

—పడుచువాడు పలుకుబడి కలవాడై తనకు అమ్మాబాబూ లేని పడుచైనట్లయితే చురుక్కున జవాబివ్వలేదు. వినండి.

బాలయ్య

నీ లేడి కన్నులోలె శంద్రి
నీ లేతనవ్వులోలె శంద్రి
ఆతీగె సొగసులోలె శంద్రి
ఆపళ్ళగుత్తులోలె శంద్రి
ఆనడక జోరులేమె శంద్రి
నీ నడుము సన్నమోలె శంద్రి

రంగు పింగులు సూత్తె రంబలాగున్నావు
రంగం పెడదామోలె శంద్రి

శంద్రి

నేకై శాల సిన్నదాన్ని బాలయ్య
నన్ను కంకులుబెట్టకు బాలయ్య
నాకమ్మ బాబులేరు బాలయ్య
నన్ను ఆరళ్ళుబెట్టకు బాలయ్య
నా మేనత్తసాకుతూంది బాలయ్య
నాకు మేనరికమున్నది బాలయ్య

ఇరుగు పొరుగు సూత్తె ఏమనుకొంటారో
ఎంటరాకురోరి బాలయ్య

బాలయ్య

కమ్మోరి బాయి కాడ శంద్రి
సువ్వు కడవ నెత్తిబెట్టి శంద్రి
సందు గొందులు దాటి శంద్రి
నువ్వు సిందులు దొక్కంగ శంద్రి
నీకొప్పు తిప్పులు సూసి శంద్రి
నా కోరికలాశేయి శంద్రి
నీ కాళ్ళ కడియాలోలె శంద్రి
గణ గణ మోగేయి శంద్రి
గిలుకు మట్టెలతోనె శంద్రి
నువ్వు గిర్రున తిరిగేవు శంద్రి

సూపులో సూపెడితె సుక్కలాగున్నావు
లక్కారైకలిస్తా శంద్రి

నీలంపు బావినీలు శంద్రి
నే నిక్కంగా తెచ్చిస్తా శంద్రి
తీగె పట్టెడోలె శంద్రి
నే తిన్నంగా శెయ్యిత్తా శంద్రి
నడుము వడ్డాణము. శంద్రి
నే నాణెంగ శెయ్యిత్తా శంద్రి

నీసిట్టి ముక్కుసూత్తె సిల్కలా గున్నావు
సీరెలిత్తానోలె శంద్రి

బాలయ్య నే మరులు గొన్నానోలె శంద్రి
నువ్వు మాయదారిదానోలె శంద్రి
మత్తు మందు జల్లేవె శంద్రి
నావి ఉత్త మాటలుగావె శంద్రి
నా కైరెత్తి పోతూందె శంద్రి
నువ్వు ఎంత పాపిసోలె శంద్రి

సేతిలో సెయ్యేసి సందిటలో కొత్తేను
సంక గొడతానోలె శంద్రి

తరువాత కథ ఎట్లు నడచినదీ మనకు తెలియదు. తెలియకుంటేనే అందము. ఇదైతే మేనరికానికీ అదైతే బాలయ్యకీ దెబ్బ. అందుకే ఇట్లా ముగిసిందేమోపాట.

---

# ౧౩౭ లగ్గో పిల్లా

—అనురక్తి అయినంత మాత్రాన [illegible] లేదు. ఈ పిల్ల మాటలూ పర్తకమూ చూడండి.

| | | |
|---|---|---|
| చిన్నోడు | నల్లనల్ల మబ్బుమబ్బు నుండి | లగ్గోపిల్లా |
| | అగ్గో తెల్లతెల్ల చంద్రుడొచ్చె | ” |
| | అలిబిల్లి తీగెచూడు | ” |
| | అల్లా నేరేడు కిందజూడు | ” |
| | మంచి చల్లనైన చెలమ జూడు | ” |
| | నేరేడు నీడలోన | ” |
| | నీ చారడేసి కళ్ళుజూపు | ” |
| | మారేడు నీడలోన | ” |
| | నీ బారెడంత జడనుజూపు | ” |
| | నిండు పున్నమనాడు | ” |
| | పండు వెన్నెలగాచె | ” |
| | చిన్నారి చిన్నదాన | ” |
| | నాకన్ను పండు సేయరాదె | ” |
| | పొన్నపూలు ఏరితెచ్చి | ” |
| | నీ చిన్నిచేతి నియ్యరాదె | ” |
| | అందమైన నీదుమోము | ” |
| | ఆ చందురుడ్ని ఓడించె | ” |

| | | |
|---|---|---|
| చిన్నోడు | తెల్లజొన్న రొట్టెజేసి | లగ్గోపిల్లా |
| | మంచి వెన్నబూసి వెంటతేవె | ,, |
| | పల్లెదరి తోటకాడ | ,, |
| | మంచి తెల్లమల్లి పూలుతేవె | ,, |
| | నా చేను పండిపోయె | ,, |
| | ఇంక నీచేను పండదాయె | ,, |
| | చేను చేను గలసినట్టు | ,, |
| | నీమేను మేను గలపరాదె | ,, |
| లగ్గోపిల్ల | కారుమాట లాడబోకు | పిల్లవాడా |
| | మావారు వచ్చిచూస్తారు | ,, |
| | కారుమబ్బులొచ్చినాయి | ,, |
| | నాకుదారి చూపులేచివచ్చి | ,, |
| | కటికి చీకట్లు కమ్మె | ,, |
| | చిటుకుపొటుకుమంట వాన జూడు | ,, |
| | అటుకు మీద పిడకలన్ని | ,, |
| | ఆ అటుకు మీదె వుండిపోయె | ,, |
| | గుడిసె మంచె కెళ్ళుదాము | ,, |
| | చూడు తడిసిపోయి వణుకుతాము | ,, |
| పిల్లవాడు | నీ చేనుగుడిసె మంచె | లగ్గోపిల్లా |
| | నా చేను వొట్టిమంచె | ,, |
| | తెప్పమీద తెప్పవచ్చె | ,, |

| | | |
|---|---|---|
| | చెప్పతోటి చినుకులొచ్చె | లగ్గోపిల్లా |
| | అంగట్లో మొన్నగొన్న | ,, |
| | కొత్తగొంగడన్న కప్పుకోవె | ,, |
| | దగ్గరకి రారాదె | ,, |
| | నీవు సిగ్గుబడితె తడుస్తావు | ,, |
| | వాన వెలిసి వెన్నెలొచ్చె | ,, |
| | మనం తానమాడి నట్టులాఢు | ,, |
| లగ్గోపిల్ల | బట్టలన్ని తడిసిపోయె | పిల్లవాడా |
| | నేనుపట్టుకోక తెచ్చుకుంట | ,, |
| పిల్లవాడు | నీవు పట్టుకోక తెచ్చుకుంటె | లగ్గోపిల్లా |
| | నేను పట్టంచు ధోతి గడత | ,, |
| | లగ్గమైన మనసు తోటి | ,, |
| | మనం లగ్గమైతె బాగుండు | ,, |
| లగ్గోపిల్ల | వూరుపల్లె విడిచిపెట్టి | పిల్లవాడా |
| | ఈ వూరు బయట లగ్గమేంది | ,, |
| | బాజాబజంతీలేవి | ,, |
| | మంచిమోజు మీద సవ్వడేది | ,, |
| | కులము కులము కలసినంక | ,, |
| | ఈ పొలముకాడ తొందరేమి | ,, |

పిల్లవాడు గాంధర్వము కబుర్లు చెప్పటానికి దుష్యంతుడు కాకపాయె. పిల్ల గట్టి క్రేక్కే వేసింది.

# ౧౨౮ గుండ్లపల్లి గురివి

—పడుచువాడు తన వలపుకత్తెను గురించి నేస్తగానితో—విదూషకునితో కాదు—చెప్పుతున్నాడు. ఆమె సిరిమంతురాలు. తనకీలుకడియము చెక్కించి వానికి కిన్నెర చేయించినది. అందరికీ మూడుదుర్లా వీనికి నాల్గుర దుర్డా ఇచ్చుటలో ఆశ్చర్యమేమున్నదీ? చెలిమి మంచితనము వలపునుగలచోట వీనితగులముండుటలో ఆశ్చర్యమేమున్నది ?

బావిగడ్డున చేనుజెయ్యరో చన్నంగిరామా
బావినీళ్లకు చేను వచ్చేనూ !

అన్నది ఈకోవలోని ప్రియురాలే తనవలపుకానితో, వాడు సొమ్ముకలవాడు కాడు. ఆకొండ్ర పండదని జంకు.

బావి గడ్డున చేనుజేస్తేనో జాలారిపాపా
చేనుగుత్తామీదబడితేనో

అన్నాడు. వలపుండవలెనుగాని ఉపాయములకులోటేమి ?

చేనుగుత్తామీదబడితేనో చన్నంగిరామా
చెవుల కమ్మలమ్మి కట్టేనూ

అని ధైర్యము చెప్పినది.

గుండ్లపల్లి గురివిరా – దాని
చేత కీలు కడియమురా
కీలు కడియంసెడాగొట్టి
కిన్నెరాచేయించెరా

కోడిని స్తామానెరా కోడి
పెట్టనిస్తామానెరా
కోడిసమ్మిన్న కాలురూపాయి
కోరియిస్తామానెరా

వారవారముదినమురా రామ
సవురేపల్లె నంతరా
సవురేపల్లె సన్నామల్లెలు
కుచ్చులిల్నాల్నర దుడ్డురా

ఊరిపడమట బాటరా నే
బాటకూలికి పోతరా
అందరాకు మూడుదుడ్లు
నాకు నాల్నర దుడ్డురా !

ఇటువంటి పాటయే ఒకగొల్లదానిని గురించినది కలదు.

కుడితట్టకొప్పాది కుంకుమర్రైకది
బామా సక్కని గొల్లదిరా–కులమూసక్కనిగొల్లదిరా
మాపిడిగొర్లా మందకు రాగా ॥ మా ॥
మర్మామెరుగని గొల్లదిరా, అదియేమీ యెరగని సిన్నదిరా॥
చప్పిడిమెట్లా సల్లాకడవలు ॥ చ ॥
సరసామెరగని గొల్లదిరా సంసారమెరుగని గొల్లదిరా ॥

ఇది పైదానివలె మిశ్రగతిలో కాక చతుర స్రగతిలో జోరుగాసాగిపోతున్నది.

---

# ౧౨౯ పిలుపు

—ఇది పిల్లవాని విరహమును తెలుపుపాట. వెన్నెలలో మల్లెపూల పందిరి క్రింద వెండి కట్ల కిన్నెర పట్టి కూర్చున్నాడు. ఆమె వచ్చిన నవ్వులోనె తెల్లవారునట. అనుభవములను మీదుకట్టి ప్రాచీన సంస్కృత కవులవర్ణనలను అలంకారములను నెమరువేస్తు రచించే పండితుల వర్ణనలు ఈ పాటపొలిమేరలను చేరగలవేమో చూడుడు. దీనిని విన్నప్పుడు ఉమర్ ఖయాము జ్ఞప్తికి వచ్చును. ఇట్టి 'పిలుపును వహించుటకు గాలికి, మేఘునికి, చంద్రునికి కూడ సంతోషమేకదా !

వేళజూడ వెన్నెలాయె వెండికట్ల కిన్నెరాయె
మల్లెపూల పందిరాయె, వయ్యారిరావె
నవ్వులోనె తెల్లవారును

కొండగోగులు పూసెనేమొ కొండనిమ్మలు కాసెనేమొ
దొండపండులాంటి పెదిమె – వయ్యారిరావె
మనసు ఎవరి పాలుజేతును

మల్లెపూవులు పూసినట్లు మళ్లిమళ్లి మాటలాడు
మల్లె పూలవంటి మనసు, వయ్యారిరావె
పూవులెవరి పాలజేతును

నందిపూసె కందిగాసె కందికొనలు నందిమేసె
అందమైన మేలినడల వయ్యారిరావె
గంధమైన పంపబోతిని

---

# ౧౩౦ బంగారిసామి

—ఈపాట ప్రేయసీప్రియుల పరిచయాకాంక్షను ధ్వనిస్తున్నది. చంద్రుణ్ణీ, గాలినీ, కోయిలనీ తిట్టుకొంటూ పూలపాన్పుమీద శైత్యాయించు ప్రబంధ సుందరుల ఉపన్యాసముల ప్రక్కన "కమ్మగెగ్గిరి వాసనకే ఉండరాదుర ముండ నా మనసు అను ఈ చిన్నదాని కాంతి, శిలావిగ్రహము ప్రక్కన చిన్నదానివలె కనపడుటు లేదా ?

సెక్కుమీదను సన్నగోరూ, సెంపనాజవ్వాదిపూతా
సొంపుగానీ కెవరు బూసీరే, చక్కానిబాలా
ఇంపుగా నీకెవరు బూసీరే ?

ఇత్తరీ జొన్నెన్నుకొలుతూ ఈని నావులపాలుగొలుతూ
రాగిమానూపూలు గొలుతబ్బి, బంగారిసామి
నడిసి రారానాదు సరసాకూ

కుంకమూకురువేరుచేనూ, దవనమూదానింటితడికే
వంగిరారాసుంకుతగిలేనీ, బంగారిసామీ
తములపాకూ మడుపులందేనీ

కుట్ర కుట్ర సినుకులోన వుంటిరాదానింటివెనక
దూడతొత్తు మాటవినేరా ? బంగారిసామి
దుక్కిపంటా నానిపోయెరా

గారడీ దానింటివెనుక, మావిడీ కొమ్మాలురెండు
అందలేదూ పొందలేదూర, బంగారిసామీ
అన్నెకారీ కోడి కూసెరా

గాజులుండే సేనిమీదా కమ్మగెగ్గిరి సెట్టుపుట్టా
కమ్మగెగ్గిరి వాసనాకేరా బంగారిసామి
ఉండలేదుర ముండ నామనసు

# ౧౩౧ పెరుమాళ్ల చిన్నా

—ఈపాటలోని నాయిక ప్రౌఢ. అన్ని ఉపాయములూ ఆమెగారే చెప్పతున్నది ఏ అపాయము వచ్చినను పైయెత్తు ఆమె ఊహాలో ఉండనే ఉన్నది. ఏరువస్తే యీది పోదామనే చెలిమికత్తె ఈమె.

ఈపాటలోని చరణములు మాత్రమే సత్యములు. వాటివరుస, సంఖ్యకాక పోవచ్చును.

కొత్తకుండ నీరుతీపి, కోరినమగవాడుతీపి
వాడినాచెలికెంత తీపబ్బ పెరుమాళ్ల చిన్నా
పదరా బందారు పోదాము.
నీకునీవారులేరు, నాకూనావారులేరు
ఏటి యొడ్డున ఇల్లుకట్టబ్బ, పెరమాళ్ల చిన్నా
ఏరువస్తె కూడబోదాము
చెంపనాసంపంగినూనె అంచునాచెంగల్వమొగ్గ
ఏటివడ్డున యిల్లు కడదాము
బావిలోపల బల్లి పలికె బన్నసరమూ కొలుకులూడె
బిళ్లలామొలతాడు తెగెనబ్బ
పెరమాళ్ల చిన్నా
ఏరువస్తె ఈది బోదాము
ఆకసాన ఆకుతోట యంత్రమధ్యన పూలతోట
పూలతోటలో బండ్ల బాటమ్మ పెరమాళ్ల చిన్నీ
బండ్ల బాటలో మంచి మాటమ్మ ॥

—

## ౧౩౨ మాఁవ

ఉల్లిపూలా పడవాగట్టి

మాఁవ !

మల్లి రేకుల తెడ్లనుదించి

నాగులేటి వాగులోన

మాఁవ !

తేలీ పోదామా ?

మొగిలిపూల తేరూగట్టి

మాఁవ

మొగిలి రేకుల గొడుగుపట్టి

మొగులు మేసే కొండా మీద

మాఁవ

ముద్దుగానే ఎళ్లూదామ

'కుంభగతప్రదీప కళికాకృతిఁ దోప నెందుంబోకుండే నింద్రియముల్ రహిఁదాఁగను' ఇంపు కోరలేదీ ప్రేయసి. మొగిలిరేకు గొడుగు పట్టి మొగులు మేసేకొండమిద నీడబొమ్మలవలె గోచరిస్తుండడమే ఈమె కాంక్ష.

---

# ౧౩౩ చల్ మోహనరంగ

—చల్ మోహనరంగ పదము ఎరుగనివారుండరు. వనజాక్షి ప్రణ్యాఘాయని దాని అసలు వరుస రూపుమాసిపోయినది. రచన ప్రాకృతుని రచనకాదు. కాని అసలు తెలియనప్పుడు లభించినంత వట్టు ప్రచురించుటే కర్తవ్యమని దీని నిచ్చితిని. ఈపాటకు రెండు మూడు పాఠాంతరములున్నవి. కాపీరైటు సంపాదించుకొనుటకు ఏ కవిచేతనో కొన్నిచరణాలు కల్పింపజేసిన రూపములు రెండుమూడు అమ్ముల్లో కనబడుచున్నవి. అసలు పాట మన్మథుని వంటిదైనచో నిది యాతని బూది.

౧

రంగారు చెట్టుమీదా – బంగారు గోరువంక
విసిపించే కతలు విందము పదరా
చివురాకూ పళ్లెరములో – మివులపండిన పండ్లు
నవిరించీ ఆరగింతము పదరా
పొగడ పూవులుగోసి – పొందుగనే దండగుచ్చి
దండనీ మెడను వేసుకురారా
చిరిమంచుకోటలోన – గురుతైన మంచెమీద
శిరిపాట పాడుదాము పదరా ॥ చల్ ॥

౨

చుట్టు తుమ్మెదలుగూడి – గట్టి బాజాలు పాడి
అట్టిట్టు తిరుగుచున్నవి కదరా
కొనమావి కొమ్మలందు – గొనబైన రామచిలుక
ధనములందిచ్చుచున్నది గదరా

గుబురైన చింతమీద - కబురు తెచ్చేటి చిలుక
సొగసైన గూడు కట్టెను కదరా ॥ చల్ ॥

౩

నీవుపోయే దారిలోని - నిలువుటద్దములలోన
నీదురూపు నిలిచిపోయెను గదరా
చిరునవ్వా నవ్వితేనూ కురియూ పువ్వులవాన
చిరునవ్వాసించియుంటిని గదరా
శనివారం సంతలోన పనిబూవి సంతలోన నిను వెదకి
పరుగెత్తి పట్టుకొంటిని గదరా
బొండుమల్లె పూలదండ నిండుగా నీమెడను వేసి
నిండారా కౌగిలింతును రారా ॥ చల్ ॥

౪

చీకటి రాత్రినాడు - కోకనల్లది కట్టుకోని
చీకట్లో కలిసిపోయితిగదరా
ఊడల మర్రిక్రింద - మోహమైన తుమ్మచూచి
చీకట్లో ఝుషుసు కొంటిని గదరా
గట్టుదాటి పుట్టదాటి ఘనమైన యడవిదాటి
అన్నిదాటి అలసి తరలితి గదరా
ఒంటిగా పోవద్దు వద్దని - పైటబట్టి లాగగానే
పైటజారి సిగ్గుపడితిని గదరా

పొడుపు కొండలమీద – పొడుపైన చందమామ
నీలాగె నిలువబడెను గదరా
నేనొంటిగానుపోతే – నీవునావెంటవస్తే
నీడజూచి జడుసుకొంటిని గదరా ॥ చల్ ॥

౬

నీవునేనూనిలబడితే – వచ్చిపోయేటట్టివారు
చిరునవ్వు నవ్విపోయిరి గదరా
నీకునాకు నేస్తమయితే మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదుము గదరా
నాలోని వలపుతీగ నీలాలపేరుగాగ
నీకంఠమునను జుట్టితి గదరా
నీమీది వలపుతీపి – నామీది కెక్కిపోయె
నిన్నింక విడువ జాలను గదరా
ఎన్నాళ్ళకైనగాని చిన్ననీమొగముజూచి
నిలువెల్ల సొక్కిపోతిని గదరా
నీకునీవారులేరు – నాకునావారులేరు
యేటివడ్డున యిల్లుకడదాం పదరా
చల్ మోహనరంగ యేరువస్తే యీదిపోదము పదరా ॥
చేయి చేతానువేసి న్యాయమార్గము చూచి
నాయందు ప్రేమతప్పక మనరా
నీవే చందూరుడైతే నేనే వెన్నెలనాదు
భావించి వెంటనుందును కదరా ॥చల్॥

౭

పాపిష్టి గాలివాన బెజవాడకు రాకపోతే
కష్టాలె లేకపోవును గదరా
కంటికి కాటుకెట్టి కడవ చంకానబెట్టి
కన్నీరు కడవనిండెను గదరా
నీరూపు చూడగోరి దారులుగాచగానె
పాడైన శకున మాయెను గదరా
నీవు నేను ఏకమైతే నిండుచందురుడు నవ్వి
మేఘాల దూరిపోయెనుగదరా
నిన్నుజూచి నన్నుజూచి పున్నమచందురుడు
నవ్విచిక్కి శల్యమయ్యెనుగదరా
విరజాజిపూలు పూసే ఉన్నతైన వనములోన
గురువిందలేరుదాము పదరా
పసిడి పన్నీటిలోన మిసిమి కాంతులతోడ
బంగారుచేపలున్నవికదరా
బలమైన అలలురేగి చలియించు సాగరమున
సంగీతమాలకింతముపదరా
నరులు కన్పడనిచోట సురలు చెన్నారువీట
అందముగా ఆడుకొందముపదరా
తెలితామరాకు జండా గలపూల రథముమీద
దేశాలు తిరుగుదాము పదరా

పూవులరథముగట్టి చిలుకగుఱ్ఱములుగట్టి
పోయివత్తము గాలివీథిని పదరా
పూలతోటి బుట్టగట్టి – బుట్టకు ముత్యాలుచుట్టి
బుట్టలోనె యెగిరి పోదముపదరా
అమృతప్రవాహమైన ఆకాశగంగలోన
సరిగంగాలాడుదాము పదరా

౨

నీమొగము చందమామ—నీకళ్లు కలువపూలు
నామొగము తోటిచేర్చిపోరా
నీనోట నున్నమురళి నానోటనుంచి చూడు
నేనొక్క పాటపాడెద వినరా
మధువూనీ మోవితేనె—అదిరానే నానియాని
మలిమాలి సొక్కి సోలితి గదరా
నీవొక్క హంసమైతే నేను మానసమగుదు
పన్నీట నిదురబుత్తును గదరా

౩

తేట పన్నీటిలోన నీటుగాను జలకమాడి
మధుర నీరూపుచూపను పదరా
మధురా నీగుండెలదరా—నిదుర కంటికిరాదు
రెండు కొండ లడ్డమాయె గదరా

బంగారు పంజరాన—చెంగావి చిలుకలంటె
చెంగావి నీదు మోవి గదరా

౧౦

కస్తూరి బొట్టుపెట్టి కలికితురాయిగట్టి
నీవేనా రాజువైతివి గదరా
కల్యాణ మందిరమున కనకంపు గద్దెపైన
మంగళ హారతి చెప్పెద రారా ॥

---

# ౧౩౪ ముద్దులబావ

—ఇదేదో రెండుమూడు పాటలు కలిపి కట్టిన బొంత. ఒకటే గాడీవాని పాట లేక, ఓడపాట. రెండోది 'రాతిరి పన్నెండు గంటలకు రాను తిరిగి నేనువస్తి' అన్నది. ఈ రెండోపాటది, 'రమణి ముద్దులగుమ్మ' అన్నది ప్రచారముగల పల్లవే. పూర్తి పాట మాకు లభింపలేదు. ఇక్కడ ఇచ్చిన ఈ పాట "ఘరవాణేమో" అనిపిస్తున్నది. ప్రేమస్త్రీప్రియులు లేచిపోవుట పాటకపు జనములో గలదు. ఆ సందర్భమునకిది ఉదాహరణము.

ముద్దులబావా ! ఓ ముద్దులబావా !
నారాజా నారాజ । నా రాజనిమ్మలపండు
నా ఒప్పారాలకుప్ప । నా అచ్చావుపాలు
నా అప్పుడుకాచిన్నేయి । నా అప్పడాలకట్ట
నా అంటుమామిడి గున్నా । నా జంటయాడకుంటావా ॥ ము ॥
రమణి ముద్దుల గుమ్మా । ఓ ముద్దులగుమ్మా
నారాణి నారాణి । నారాణి ముద్దులగుమ్మ
నా; గజనిమ్మ పండు । నా ఆవకాయబద్దా
నా; అప్పడాల పీట । నీయబ్బమీద ఆన
నిన్నిడిసి నిముసముంటానా । ముద్దులగుమ్మా ॥ ర ॥
మనసంటే ఎంతవరకో । మాటంటేఎంతనిరుకో
పైనమేమి తెలియకుండ । వాసివన్నెచూడకుండ
ఉన్నవూరు లుంటేను । విన్నవారునవ్వుతారు
మన మేవూరుపోదామో । ముద్దులబావా !
చిలకా గోరింకలవలెగా । కలసి మెలిసి ఉందాము ॥ ము ॥

ఓ రంగు రంగుల । రమణరంగీ

సొగసులెన్నో జరిగిపోతు । నగంప్రేమ సాగిపోతు

ఇరుగు పొరుగువారితోను । ఇనుమంత చెప్పకుండ

చిలకా గోరింకలముగా । చెంగు చెంగున లేచిమనము

లింగాలపురికి పోదామె । రమణి ముద్దులగుమ్మా ॥ ర ॥

---

# ౧౩౫ దేశోళ్ల చిన్నది

—బీరు చూపించు పిల్లతత్త్వాన్ని వెల్లడిచేసే పాట ఇది. చిన్నదాని చూచినవ్వింది. మిట్టపిల్లలాగ మిడిసిమిడిసిపడుతున్నది [illegible]. [illegible] నున్నదని సాహసించినాడు. "సాహసేలక్ష్మి" అనికదా [illegible]?

నన్నుచూసి నవ్వింది దేశోళ్ల చిన్నదీ
మెట్టూ యెట్టింది – అహామేలుకళ్ల దీపెద్ద ॥ మేలు ॥
సట్టిసేతబుచ్చుకోని సాగెడుతుందీ
మిట్టపిల్లలాగ మిడిసి మిడిసి పడుతుందీ ॥ నన్ను ॥
కోక కట్టుకుంది సెవ్వాకులెట్టుకుంది – కొత్త
ఎల్లిక ఎల్లోరి ఎల్లు ఎల్లు మన్నదీ
సల్లగచ్చైతాకుతేను పల్లకున్నదీ ॥ నన్ను ॥

# ౧౩౬ రాగంవాళ్ల రంగుచిన్నది

—వీడెవడో బాడవాడు. వీని మైకము జీవితావసరములను దాటినది.

తల్లి అబ్బ పోరా గడ్డికి
నాబాబు పోరాగడ్డికి
నాతండ్రి పోరాగడ్డికి
కొడుకు రాగంవాళ్ళరంగు చిన్నది వస్తానన్నది గడ్డికి
అదివస్తేపోతాగడ్డికి రాకుంటేపోనే గడ్డికి
తల్లి అబ్బ పోరా గడ్డికి
నాబాబు పోరా గడ్డికి
నాతండ్రి పోరా గడ్డికి
కొడుకు చిలకముక్కు-చిన్ని కొడవలి తెస్తానన్నది గడ్డికి
అది తెస్తేపోతాగడ్డికి లేకుంటేపోనేగడ్డికి
తల్లి అబ్బ పోరా గడ్డికి
నాబాబు పోరా గడ్డికి
నాతండ్రి పోరా గడ్డికి
కొడుకు మొనలేని పెద్ద బొరిగె తెస్తానన్నది గడ్డికి
అదితెస్తేపోతాగడ్డికి లేకుంటేపోనే గడ్డికి
తల్లి అబ్బ పోరా గడ్డికి
నాబాబు పోరా గడ్డికి
నాతండ్రి పోరా గడ్డికి

కొడుకు  అడుగులేని పెద్ద గంపతెస్తానన్నది గడ్డికి
అదితెస్తేపోతాగడ్డికి లేకుంటేపోనే గడ్డికి

తల్లి  అబ్బి పోరా గడ్డికి
నాబాబు పోరా గడ్డికి
నాతండ్రి పోరా గడ్డికి

కొడుకు  కరకంచుపెద్దకోక తెస్తానన్నది చుమ్మక్
అది తెస్తేపోతా గడ్డికి లేకుంటేపోనే గడ్డికి

తల్లిపోరు పడలేక గడ్డికోతకు పోయినప్పుడైనా చిలకముక్కు చిన్నికొడవలి, మొనలేని పెద్ద బొరిగె, అడుగులేని గంపకావలెనట వానికి ! వేరు సాధనములైనచో గడ్డికోతకు అంతు గలుగును. ఈసాధనములతో పవలంతయు 'పని' లో గడవగలదు.

---

# ౧౩౭ బాటలో సరసము

—చిన్నది - కాదుకాదు పెద్దదేకాని వయసు - పలకరించుమన్నది చిన్నవానిని.

ఆవు నెద్దు బండికట్టి
పరువు పరువున పోయేవాడ
బండినిలిపి బాసలాడర
పెదమల్లి చిన్నా
బండినిలిపి బాసలాడర
ఆకసమున అరటివనము
ధరణిమీద నిమ్మవనము
నట్టనడుమ బండి బాటోయి
బండి బాటలో బొమ్మలాటోయి
ఉద్దగిరి బండమీద
ఉద్దులెండబోసే పాప
ఉద్దులకు ఎద్దులొచ్చెనే
సుద్దులాడ పొద్దుపోయెనే
బాటవార బండ్లమీద
చెక్కగొట్టె మీఅక్కమగడు
చెక్కవచ్చి చెంపదగిలెను
ఎక్కడలేని దుఃఖమొచ్చెనే
బాటవార బండమీద
వడ్లాదంచే చిన్నపాప
నానబియ్యం నాకుపెట్టవా
మళ్ళిరారా మలచిపెట్టేను

ఆకసమున అరటివనము, ధరణిమీద నిమ్మవనము నట్టనడుమ బండిబాట. ఈపాటలో ఆబాట లోని బొమ్మలాట గోచరిస్తున్నది మనకు. ఇటువంటిదే 'ఓబులేశునిపాట'

# ౧౩౮ ఓబులేశుని పాట

ఓబులేశునీ కొండలనడుమా
వొంచెగడ్డికోసేదానా
వొంచెగుడ్డావొల్లెగుడ్డవే ॥ హరిఓబులేశ ॥
గిద్దెలగిరి కొండాలనడుమా
యెద్దులుకాచే ముద్దూల మరదీ
నన్నుచూసీ నవ్వబోకోయా ॥ హరి ॥
కట్టమీదనుంచెళ్లేదానా
కాలుకురచా చిన్నదానా
కానులిస్తాయెంట వస్తావా ॥ హరి ॥
ముందటరకా దున్నేవాడా
ముద్దుల మేనత్తకొడుక
దాపలెద్దుకు దప్పికాయెనోయా ॥ హరి ॥

ఎన్ని చరణాలుంటే తనవితీరగలదు ఈ పాటతో. గడ్డిమూట కట్టుటకు లక్ష్మీదేవికివేరే 'గుడ్డ' లేక వల్లెలో మూటగట్టినదట; సరి. చిలిపి చూపుల అహోబిలేశుడూరకొనగలడా ?

---

# ౧౩౯ సిన్నోడు - సిన్నది

—వస్తువు కొంచెము భేదమైనప్పటికిన్నీ ఈ సంవాదముకూడా చిత్రముగానే నడుస్తున్నది.

కొండలోవుండే సిన్నోడా
నీకు కూరేడ కద్దురో సిన్నోడా ?
కుమ్మరోనింటిలో కుండమ్మా
కుండగిండమ్మ నాకంత కూరమ్మా
కూడు గలిగిన సిన్నోడా
నీకు పప్పేడ కద్దురో సిన్నోడా ?
అప్పడాలమ్మే కుప్పమ్మా
కొప్పుతిప్పితే నాకంత పప్పమ్మా
పప్పులు గలిగిన సిన్నోడా
నీకు చారేడ కద్దురా సిన్నోడా ?
సీమలోపోయే యేరన్నా
ఏరుపెరికితే నాకింత చారన్నా
చారు గలిగినా చిన్నోడా
నీకు నెయ్యేడ కద్దురో సిన్నోడా ?
కుక్కనుకొట్టే కొయ్యమ్మ
కొయ్య గియ్యమ్మ నాకంత నెయ్యమ్మా
నెయ్యిగల్గినా సిన్నోడా నీకు
పెరుగేడ కద్దురో సిన్నోడా ?

ఆయింటి యీాయింటి పెరుగమ్మా
పెరుగు గిరుగమ్మ నాకంతపెరుగమ్మా
పెరుగుగల్గినా సిన్నోడా నీకు
పాలేడ కద్దురో సిన్నోడా ?
ఆవులామేపే బాలన్నా బాల
గీలన్న నాకంత పాలన్న
పాలు గలిగినా సిన్నోడా నీకు
వక్కేడ కద్దురా సిన్నోడా
అడవిలోపొయ్యే నక్కన్నా
నక్కగిక్కన్ననాకంత వక్కన్నా
వక్కగలిగినా సిన్నోడా నీకు
ఆకేడ కద్దురా సిన్నోడా ?
ఆకసానపొయ్యే కాకమ్మా
కాకినేకమ్మ నాకంత ఆకమ్మా
ఆకుగల్గినా సిన్నోడా నీకు
సున్నమేడ కద్దురా సిన్నోడా ?
ఆయింటి యీాయింటి సూరమ్మా
సూరగీరమ్మ నాకంత సున్నమ్మా
సున్నమూగల్గినా సిన్నోడా నీకు
పొవ్వాకు ఏదిరా సిన్నోడా ?
సెట్టుమీాదావుండె పిట్టన్నా
పిట్టగిట్టన్న నాకంత మట్టన్నా.

# ౧౪౦ వదిన

—ఇది వయసుకుపసని సరసము. పిల్లగాడు వదినతో సరసములాడుతున్నాడు.

ఒడ్డుమీద కూసున్న పిల్లగో
నువ్వెవ్వరి కొడుకవో పిల్లగో
నేను మేనత్త కొడుకను వదినో
నీకు నీసైన చీరెలు దెచ్చేను వదినో
చీరెలు బీరెలు అక్కడా
నామనసైన మాట ఇక్కడా
నీ దగ్గరికి వత్తిని వదినో
నీకు సైకెల్ దెత్తిని వదినో
సైకల్ బీకెల్ అక్కడా
నామనసైన మాట యిక్కడా
పొంగుకుంట వత్తిని వదినో
నీకు పోగుల్ దెత్తిని వదినో
పోగుల్ గీగుల్ అక్కడా
నా మనసైనమాట ఇక్కడా

వదినకు ఇచ్చకాలు గిట్టవు. మనసైన మాట పలికితే వింటుంది. చీరెలు, సైకలు, పో/ అల్లంత దూరములో నుండవలసినదే.

# ౧౪౧ గైరమ్మ

—వీడెవరో మరియొక ఆకు జాస్తిగా చదివినవాడు. నక్కజిత్తులు చేస్తున్నాడు. వెర్రికాకి వీనివలలోపడేనా ?

గైరమ్మోల్ ! గైరమ్మా !
నిన్నేతల్లి గన్నదే । గైరమ్మా ॥ గై ॥
నీముక్కెంత చక్కనే । గైరమ్మా !
నీముక్కులో నత్తెంత । అందమే । గైరమ్మా ॥ గై ॥
నీనడుమెంత చక్కనే । గైరమ్మా !
నీనడుము వడ్డాణమెంత అందమే । గైరమ్మా ॥ గై ॥
నీకాళ్లెంత చక్కనే । గైరమ్మా
నీకాలిఅందెలెంత, అందమే; గైరమ్మా ॥ గై ॥
నీవ్రేళ్లెంత చక్కనే । గైరమ్మా
నీవెల్లమీది నగలెంత అందమే । గైరమ్మా ॥ గై ॥
నీకళ్లెంతచక్కనే । గైరమ్మా
నీకళ్లకాటుకెంత అందమే । గైరమ్మా ॥ గై ॥

వీని పొగడ్తలు గైరమ్మకోసమా, నత్తువడ్డాణము, అందెలూ నగలూ కోసమా ? తెలుసుకోగల అవకాశము మనకులేదు.

---

# ౧౪౨ బంగారి పిల్లా

—ఈచిన్నవాని ప్రేముడి బూటకము కాదేమో, 'బంగారిపిల్ల' కు అందపు దుస్తులు తెత్తననుచున్నాడు.

ఓ సిలిపిమాట సిన్నదాన
సిలకపూల సీరబెట్టేనే
ఓ రామసిలకా రంగసానీ
రంగు రంగుల రయిక దొడిగేనే
మునుము బట్టి కూరుసుంటే
గనిమదాకా పలకరించవు
పట్టుపూలా సీరదెచ్చేనే
బంగారిపిల్లా పట్టుకుచ్చులు నీకుదెచ్చేనే.

గట్టిదే! మునుముపట్టి కూర్చున్న 'కనుము' దాకా పలకరించదు. ముచ్చటలన్నీ రాబట్టుచున్నది. కనుమకడనైనా పలకరించుకుంటే ఎట్లా ?

# ౧౪౩ చిన్నవాడు - చిన్నది

—వీరిద్దరూ అనుకూలురు. ఆ ఉత్సాహము బాగుగా తెలుస్తుంది చూడండి.

౧

చక్కని గుంటా । రాజు సొగసొంటా ।
సరసకూచుంటా । పెళ్లి చేసుకుంటా
గుఱ్ఱాన్నెక్కిస్తా । కూడా సేనొస్తా ।
సఱ్ఱాన పూరంత । సైదిరిగి వత్తాము ॥ చ ॥

౨

నేకులాన గుంటా । నిన్నంటా
నిన్నే పెళ్లాడతా । నంటా
నాకు నీకు జోడంటా
నాకేమిపెట్టకు । తంటా ॥ చ ॥

౩

చేపల బుట్ట । చంక నెట్టి
సందెడు పూసలు । మెళ్లోబెట్టి
కోపుగ కాశేర్రిడు । చీరనుగట్టి
గోశేసిన రవిక । తొడిగబెట్టి ॥ చ ॥

---

# ౧౪౪ గంగమ్మ పాట

—వీడు ప్రబంధములు చదివినవాడు. అందును నలుని దమయంతీ అభ్యంతరమందిర ప్రదేశమును తప్పక పఠించి యుండును. గంగమ్మ వెర్రిదేమీ కాదు. ఊరించి ఊరించి ప్రేమించినది.

| | |
|---|---|
| వంగసెట్ల పక్క | గంగమ్మా |
| నీవు వంగి సూత్తుంటే | ” |
| పానం జల్లుమనె | ” |
| నీవు పక్కకెందుకురావు | ” |
| పక్కాన నిలుసుండి | ” |
| నీవు ఒక్కసారి ముడితె | ” |
| నీ కంట్లోకి సూత్తానె | ” |
| నేనొల్లుమర్చిపోతా | ” |
| అనుమాండ్ల గుడికాడ | ” |
| నువు వంగి మొక్కంగా | ” |
| నీ కొంగు జారెనే | ” |
| బుద్ది దీరంగ జూస్తినే | ” |
| మీ యింటి ఎన్కాల | ” |
| పూల సెట్లల్లోన | ” |
| పూలు తెంపుతుంటె | ” |
| నీ సీర సినిగిపోయె | ” |

| | |
|---|---|
| సీర పోతేపోయె | గంగమ్మో |
| ఒక్కసారి రావె | ,, |
| వచ్చి సూడకుంటె | ,, |
| నేన్నచ్చి పోతానే | ,, |
| దొంగసూపు సూత్తె | ,, |
| నేన్వంగి వంగి సూత్త | ,, |
| రంగదేవుని కాడ | ,, |
| నువు దొంగపూజ సేత్తవు | ,, |
| దొంగ పూజెందుకే | ,, |
| నాకు వంగి సలామను | గంగమ్మా |

నిజమే. దొంగపూజలెందుకూ ? స్వయముగా పోయి ఆతని బండారమును చూచినట్లయితే తెలిసిపోవునుగదా !

---

# ౧౪౫ గంగి - గంగారాం

—గంగి ఏవో మిషపై గంగారాం కడకుచేరినది. తాను వదలి పోయిన వస్తువులట అడుతున్నది. ఏవీ ఇవ్వను, నిన్ను పోనివ్వను అంటున్నాడు. అయితేపట్టి మాటలకు మోసపోదు కాదుగంగి !

| | |
|---|---|
| చిక్కుడు చెట్లల్లో | గంగారాం |
| నా సిగ్గుబోయిందీ | ,, |
| నా సిగ్గు నాకియ్యి | ,, |
| నా వోల్లను కల్వాబోత | ,, |
| నీ సిగ్గు నీకియ్యానే | గంగి |
| నీ వోల్లను కల్వాబోనియ్యానె | ,, |
| వంకాయ సెట్లల్లో | గంగారాం |
| నా వంకె పోయిందీ | ,, |
| నా వంకె నాకియ్యా | ,, |
| నావోల్ల యింటికిపోత | ,, |
| నీ వంకె నీకియ్యానే | గంగి |
| నీవోల్ల యింటికి పోనియ్యానే | ,, |
| చీర సెట్లల్లో | గంగారాం |
| నా చీరె పోయిందీ | ,, |
| నా చీరె నాకియ్యా | ,, |
| నావోల్లను కొయ్యవోత | ,, |

| | |
|---|---|
| నీ చీర నీకియ్యనే | గంగి |
| నీవోల్లకు కొయ్యవోసియ్యనే | ,, |
| బండమీద బండలంటివి | గంగారాం |
| బంగారు తలుపంటివి | ,, |
| బండమీద బండఏది | ,, |
| బంగారు తలుపేది | ,, |
| ఈదుల్ల ఇల్లంటివి | ,, |
| ఇద్దరికి జోడంటివి | ,, |
| ఈదుల్ల ఇల్లేది | ,, |
| ఇద్దరికి జోడేది | ,, |
| గుట్టమీద గుడిసంటివి | ,, |
| గురిజాల తలుపంటివి | ,, |
| గుట్టమీద గుడిసేది | ,, |
| గురిజాల తలుపేది | ,, |
| ఇంటనే బాయంటివి | ,, |
| ఇద్దరికి జోడంటివి | ,, |
| ఇంటనే బాయేది | ,, |
| ఇద్దరికి జోడేది | గంగారాం |

గంగారాం ఆటకట్టుబడినట్లున్నది. తోసిరాజైన ఏమిచేయగలడు? ఎక్కడా మొగమాటము లేదు గంగికి.

---

# ౧౪౬ గంగి

గంగీకి నాపైన మనసొప్పకుంటేను
నడబావిలోపడి - చస్తానని చెప్పు గంగితో
మాపు - వస్తాననీ చెప్పు గంగితో ॥

చెవులాకు కమ్మాలు, కాళ్లాకి అందేలు
తెస్తానని చెప్పు గంగితో
మాపు - వస్తాననీ చెప్పు గంగితో

బాణాల చీరాను, బొమ్మంచురవికాను
తెస్తాననీ చెప్పు గంగితో
మాపు - వస్తానని చెప్పు గంగితో

అన్నీ ఆ తుంటరి మాటలే. ఆగంగి వీనికి లొంగునా ?

---

# ౧౪౭ యెరికిలి

—ఈమె జారిణి. తన అన్వేషణమునూ, రంపువాండ్ర [illegible] ఉపన్యసిస్తున్నది. తారచెల్లెలు. వాడు [illegible] యెరికిలి.

గాజులుండె చేతిలోన గందవొడిపూతపూసి
వీధి వీధులు పలవరించురా – ఓ యెరికిలీ
వీధి వీధులు పలవరించురా
బావిలో బచ్చల్లికూర చేనిలో చెంచల్లికూర
చెంపకూ సంపెంగ నూనెరా – ఓ యెరికిలీ
చెంపకూ సంపెంగ నూనెరా
నూగునూగు మీసమోడ, నూగుచెట్లకావిలోడ
పరగచేని బాటతెలుపుమురా – ఓ యెరికిలీ
పరగచేని బాటతెలుపుమురా
కూడు పెడతా తినిపోరా, కూడావస్తా తోడుకపోరా
ముల్లులేని మొల్లకిందికీ – ఓ యెరికిలీ
ముద్దులాడి మళ్లిపంపురా
ఈతమానూయిల్లుకాదూ తాటిమాను తావుకాదూ
తగరం బంగారు కాదురా, ఓ యెరికిలీ
తగులుకున్న మొగుడు కాదురా

---

# గళలా సంతలో బావ

—ఈ చిన్నదానికి విధి విపర్యాయమైనది. బావ ఈమెను వివాహమాడ లేదు. అయినప్పటికీ సంతలో నిండు కన్నుల చూచి సంతోషించినది. దానిపర్యవసానమును గమనింపుడు.

శుక్రవారం సంతలోన బావయ్యో బావయ్యో
చుట్లమీద తొక్కినావు బావయ్యో బావయ్యో
నువ్వు తొక్కినందుకేడ్వలేదు బావయ్యో బావయ్యో
నీకాలు నొప్పికేడ్చాను బావయ్యో బావయ్యో
ఆదివారం సంతలోన బావయ్యో బావయ్యో
అంది అంది గుద్దినావు బావయ్యో బావయ్యో
నువు గుద్దినందుకేడ్వలేదు బావయ్యో బావయ్యో
నీగుత్తినొప్పికేడ్చాను బావయ్యో బావయ్యో
బుధవారం సంతలోన బావయ్యో బావయ్యో
నాబుగ్గలట్టుకు కరిసేవు బావయ్యో బావయ్యో
నువ్వు కరిసినందుకేడ్వలేదు బావయ్యో బావయ్యో
నీపళ్ళనొప్పికేడ్చినాను బావయ్యో బావయ్యో

మొదట అతిశయము ఎక్కువై ఆమెకాలిచుట్లు మీద తొక్కినాడు. ఆమె బాధపడలేదు. తరువాతగుద్దినాడు. ఆమెకు నొవ్వలేదు. దీనితో వానికే దెబ్బతగిలినది. బుధవారము సంతలో తనతప్పు తీర్చినాడు. కాని ఏమిఫలము ? బాధయేమిగిలినది. ఈసందర్భమును బట్టి వేరొకపాట జ్ఞప్తికి వస్తున్నది.

చీమిడిముక్కుది చింపిరితలకాయా
ఒల్లానంటివిగదర ఒల్లానంటివిగదర

ఓ మేనమామా ॥

ప్రాయమొచ్చినపుడు - పైటొచ్చినపుడూ
ఓగిస్తైవచ్చినె ఓగిస్తైవచ్చినె

ఓ మేనమామా ॥

అని చిన్నప్పుడు చూచి తనొల్లని మామను దెప్పిపొడుచు చున్నది వయసులోనున్న చిన్నది. అయితే యీమె స్వాధీనపతిక. ఇందాకటి పాటలోనిది విప్రోషితవలెనే కన్పించుచున్నది.

## ౧౪౯ వలచిన చిన్నవాడు

— ఇటువంటి నాయికయే వలపుకాడు కీర్తించి మాయమైనందుకు విలపించుచున్నది.

వాడు; వలచినాడమ్మా !
నను తలచినాడమ్మా ! ...చందమామోయ్ !

వాడు; వలచినా ! తెల్లారి;
పిలచినా ! పలుకడు ! ...చందమామో !

వాడు; పిక్కల సన్నంపు,
బిగువైన మగవాడు; ...చందమామో !

వాడి; భుజాన ఉన్నది;
భూచక్రి కంబళి; ...చందమామో !

అది; పదిగల్లు భూమిపై;
పరచినా చాలమ్మా ! ...చందమామో !

వాడి; మునిపల్ల సందున,
ముత్యాలు తాపిస్తు; ...చందమామో !

వాడి; పక్కాన ఉన్నది;
పచ్చలపిడి బాకు; ...చందమామో !

అది, ఎదలోన ఒకసారి
అదిమినా చాలోయి; ...చందమామో !

వాడు; వలచినా దాకాను
వలపోసి తిరిగాడు; ...చందమామో !

వాడు; వలచినా తెల్లారి
పిలచినా పలుకడు; ...చందమామో !

వాడు; కలకలా నవ్వాడు
కన్నెత్తి చూశాడు; ...చందమామో !

వాడి, కావి పంచెలమీద
కస్తూరి తావిస్తు; ...చందమామో !

వాడి; బంగారు చెక్కిళ్ళు
రత్నాలు మెరిపిస్తు; ...చందమామో !

వాడి; ముద్దైన మోముపై
ముత్యాలు విరబోతు; ...చందమామో !

వాడి; నూనూగు మీసాలు
వలపు తీగెలు పాకిస్తు; ...చందమామో !

వాడు; చూచినా చాలమ్మ
స్వర్గమే దరిదాపు; ...చందమామో !

వాడు; నవ్వుతూ మాటాడి
కవ్వించి పోయాడు; ...చందమామో !

వాని; నవ్వులోనే మనసు
నను విడిచి పోయింది; ...చందమామో !

వాడు; పలికినా చాలమ్మ
ప్రాణాలు వికసించు; ...చందమామో !

వాని; బంగారు మొలత్రాడు;
పైపైన మెరిసింది; ...చందమామో !

వాడి; ఉంగరాలజుట్టు
రంగైన మగవాడు; ...చందమామో !

వాని; కోపాన ఒకసారి
కసరి తిట్టినచాలు; ...చందమామో !

వాడు; ముసిముసి నవ్వుతో
మురిపించి పోయాడు; ...చందమామో!

ఆ; మగవాని కౌగింట
మరణించినా చాలు; ...చందమామో!

వాడు; కంటికి కనబడితే,
కదులునా అడుగేసి; ...చందమామో!

దీనికి జవాబనిపించునపాట ఉన్నవానిభావాలు కూర్చినది ఉన్నది. కాని ఆమె దేహ సౌందర్యమునూ, అంగసౌష్టవమునూ నెమరువేయునది ఆపాట.

వలపుకత్తె ఇంకొకర్తె తన సరసయ్య మామతో చెప్పుకుంటున్నది.

దూరభాగము దున్నబోకు
దిబ్బలెక్కి చూడలేను
ఊరుముంగిట ఉలవసల్లబ్బి
ఓరంపకాడ సరసయ్యమామ
ఉలవకోతకి పిలువనంపబ్బి.

---

# ౧౨౦. రాజడిగితేమందును ?

—ఈపాట కాలుజారిన చిన్నదానికీ ఆమెను తప్పుదారి త్రొక్కించిన చిన్నవానికీ జరుగు సంభాషణను వినిపించుచున్నది. [illegible]కారి. ఆమెను [illegible] పాడుగా, చెప్పి పెట్టుచున్నాడు.

కాలిమట్టెలుపోయెను । చినవాడ ! రాజడిగితేమందును ?
మన గడప పెద్దదనవే । చినదాన ! గడపతగిలి పోయెననవే.
చేతి గాజులు పోయెను । చినవాడ ! రాజడిగితేమందును ?
సెనగపువ్వురోకలనవె ! చినదాన । చెయిజారి పోయెననవే ।
వళ్లెల్ల రక్కులాయె । చినవాడ । రాజడిగితేమందు ?
మన యిల్లు చీకటిల్లు । చినదాన । మనపిల్లి రక్కులనవే ।
నొష్ట కుంకుమ (బొట్టులు) పోయెను । చినవాడ రాజడిగితేమందును?
చిరుచెమట లెక్కెననుమా । చినదాన । చెమటనుకరిగిననుమా !

ఈమె తలుపు దగ్గర పాటకొక్కదాని సైనను విన్నట్లు లేదు.

---

# ౧౫౧ వలపుకాని చావు విని -

—ఈ చిన్నది కూడ వలపు ఒకచోట వళ్లువేరొకచోట ఉన్న దురదృష్టవంతురాలే. పాపము ఈమె తన వలపుకాడు మరణించిన వార్త విన్నది. ఎట్లేడ్వ గలదు? ఆనాడే అత్తింట ఒక దూడ కూడ చచ్చిపోయినది. ఆ దుఃఖమును దూడ పేరిట వెళ్లగ్రక్కుకొని గుండె బరువు దింపుకొను చున్నది.

దూడమ్మ దూడాదూడా దూడంటె దుఃఖమొచ్చె
వాడంతా వాడిపోయె దూడైన తినిపోయె దూడమ్మ
బూరెలు వండినాను బుట్టలో పెట్టినాను
బూరైన తినిపోయె దూడమ్మ దూడాదూడా
గారేలు వండినాను గంపాలో పెట్టినాను
గారైన తినిపోయె దూడమ్మ దూడాదూడా
గుగ్గిళ్లు వండినాను గుడిసెల్లో పెట్టినాను
గుగ్గిళ్లు తినిపోవె దూడమ్మ దూడాదూడా
మంచి నీళ్ల బావికాడ మంచి మంచి గంతులేసి
మంద మోరమలగూకోయె దూడమ్మ దూడాదూడా
వరిచేలలోకిపోయి వచ్చిపోయె వారిమీద
వన్నెచూపులైనచూడు దూడమ్మ దూడాదూడా
ఎన్నెన్నొ దూడలున్నాయి ఎన్నెన్నొవాడలున్నాయి
నావాడా దూడానీవే దూడమ్మ దూడాదూడా

ఇంకొకతెకు పరిస్థితులింత పదునుగా లేవు. గుండెలు బాదుకుని ఏడుస్తున్నది:

గుండేలుగాడి తమ్ముడంట
మందపాటి కోటడంట
మారెళ్ల సుబ్బడంట
మందుపెట్టి సంపెరోరబ్బో గుండేలుగా
అరబ్బో అరబ్బో అరబ్బో గుండేలుగా ॥

# ౧౫౨ దొరగారు

— ఈపాట నుడిందృశ్యము మారి రావలసి వచ్చినది. ఇక కేవలము పదములపలుకులు, మాత్రమే పాటలకు వాహనములు. సంఘనియమములు తెలుపలేని వారికి, ఇదంతా తోక చుక్కలు. ఈపిల్లనుచూడండి, ఇష్టంవచ్చినట్టే కట్టు తెంచుకున్నది.

అద్దసేరు బుక్కాకోనీ
వంగి కీసల బోసుకోని
ఎగిరి ఎగిరి సల్లాబోతడే నా దొరగారు
ఎవరి మీద సల్లాబోతడే నాదొరగారు ॥ ఎ ॥
పావుసేరు బుక్కాకోని
వంగి కీసల బోసుకోని
పైకిపైకి సల్లాబోతడే నాదొరగారు
ఎవరి మీద సల్లాబోతడే నాదొరగారు ॥ ఎ ॥
దొరసాని మీద సల్లాబోతడే నాదొరగారు
దొరసాని మీద సల్లాబోతడే ॥ ఎ ॥

---

# ౧౫౩ పి లు పు

— ఈపిల్లకు తనసంగతి అర్ధమైనది. వివాహమునకు పోదము రమ్మంటున్నది అక్కను. ఏమధురాను భూతియో కాలికి తగులక పోవునా ?

రాయెమ్మో రాజక్క
సాలోడు సేసిన
మెరపుటద్దాల రైకె
తొడిగన్న సూత్త్రము ॥ రా ॥
అవుసులోడు చేసిన
అందమైన కమ్మలు
పెట్టన్న సూత్త్రము ॥ రా ॥
కుమ్మరోడు వానిన
గట్టి ఎసలలు
వాడన్న సూత్త్రము ॥ రా ॥
పోశమ్మ సందులోన
పొంగుతున్నది లొట్టి
తాగన్న సూత్త్రము ॥ రా ॥
పటేలు దొడ్డిలోన
గడ్డాము వున్నాది
పోయన్న సూత్త్రము ॥ రా ॥

---

# ౧౫౪ గోంగూరకి

— దీనికి మాయదారిక్కుర్రవాడు పలపన్నినాడు. పట్టుపట్టినా. ఊపాటలోనికి కొట్టుకొనుట మాత్రము కాదు. వంటికీ మనసుకీ మల్లయుద్ధము.

ఎందుకోననుకొంటి గోంగూరకి—అమ్మ
ఎందుకోననుకొంటి గోంగూరకి
పుట్టెక్కి సూశాడు గోంగూరకి—వాడు
చెట్టెక్కి సూశాడు గోంగూరకి ఎందుకో
చెట్టుదిగి నవ్వాడు గోంగూరకి—వాడు
పట్టుపట్టమన్నాడు గోంగూరకి ఎందుకో
ఎత్తుఎత్తమన్నాడు గోంగూరకి—వాడు
మోపెత్తమన్నాడు గోంగూరకి ఎందుకో
చేయిపట్టుకొన్నాడు గోంగూరకి—వాడు
చెక్కిలిని పుణికేడు గోంగూరకి ఎందుకో
కళ్ళల్లోకి చూశాడు గోంగూరకి—అమ్మ
ఒళ్ళుపులకరించింది గోంగూరకి ఎందుకో

ఈ వరసలో వల్లూరి జగన్నాధరావుగారు ఒకపాట రచించినారు. ఈచరణములు అందులోని వా అని అనుమానము కలుగుతుంది. కాని మాటలేవిన్నీ తప్పు పడినట్లు లేవు. 'గోంగూరకి అన్నది పాదాంత పదమే.

---

# ౧౫౫ పెద్దోళ్ళచిన్నది

—ఈ పిల్ల మెల్లగా జిత్తులు నేర్చుకొంటున్నది. వద్దన్నదట! పెద్దిగాడు ఈమెకంటె గడుసువాడు.

పెద్దోళ్ళపెద్దినోరి పెద్దోనే
నొద్దన్నవాళ్లకెల్లా ముద్దొస్తానే
పెద్దాపురం సంతకెళ్లి
పెద్దిగాణ్ణి కలుసుకుంటే
రావే చిలకారావే అంటూ
బుగ్గలు రెండు పట్టుకోని
బూరిముక్కలాగుతిన్నాడే ॥

ఇంటికి వచ్చి విజయసూచకముగా అద్దము చూచుకొనివుంటుంది!

---

## ౧౫౬ రూపాయి

—వీడు కుంటెనకాడు. ఆమె అనుగ్రహం, ఏదో కాసిని సంతుష్టి పడుతుందేమోనని పోషించు చున్నాడు. కాని నాకేమీ ఓప్పిది కాదు.

రూపయి కావాలా
రూపయి చిల్లర కావాలా
రూపురేక సల్లగుంటె
రూపయెందుకు రూపయిసిల్లరెందుకు
నానలజీలకరి మొగ్గ
పావల కావాలా
పావలడబ్బులు కావాలా, పిల్లా
పాదాలు సల్లగుంటె
పావలెందుకు పావలడబ్బులెందుకు
నానలజీలకరి మొగ్గ
సీరలు కావాలా, సిలుకు
సీరలు కావాలా, పిల్లా
సిరిగల నీమోము సూత్తె
సీరలెందుకోయి బావ
సారెలెందుకోయి బావ, నలజీలకరి మొగ్గ

---

# ౧౫౭ గంగమ్మొదినా

—ఇది ఎవతెయో కప్పతలకాయ దీనిది. పల్లె మనిషిది. మధువునాని ఎగిరిపోయిన తుమ్మెద కోసము ఎదురు చూస్తున్నది. వాడెవడో బర్సాత్ నాయకుడు. నిరతంబు మల్లిక కడనె యుండి ముదము గూర్పగ నాతని కొక్క-పూవేనా?

సెంగావి సీరగట్టి రంగూలారవికె తొడిగి
కొంగూనూ జారయిడిశానే ఓగంగమ్మొదినా
నేముందరెల్లివయ్యారినిలచితినే ఓగంగమ్మొదినా
బంగమయ్యె నావాలుచూపులే ఓగంగమ్మొదినా
సెవలా తమ్మంట్ల మెరుపూ సేతిమురుగూల పసుపూ
సేదేనే మీసాలనలుపూ ఓగంగమ్మొదినా
నాబారమంతా నీకె దక్కెనే ఓగంగమ్మొదినా
కోరపాగాకోరసూసిందే ఓగంగమ్మొదినా
ఉంగ్రాల జుట్టుదువ్వి సెంగల్వపాగాదిద్ది
అంగాలో ఆగిపోయాడేఓగంగమ్మొదినా
నాసంగతేదో సూసిపోయేడే ఓగంగమ్మొదినా
పొంగుపొంగు అణిగిపోయిందే ఓగంగమ్మొదినా
పొద్దుకూకే పూలసాయా అద్దరేతిరిది ఆ అరుపు
నిద్దరేదే నీలికళ్లకు ఓగంగమ్మొదినా
సద్దులేని జాములొకళ్లైనే ఓగంగమ్మొదినా
వారాలు తిరిగిపోయె దూరాలు దూరమాయె
ఏరోజా రోజుగడవాదె ఓగంగమ్మొదినా
మారాజురాకలేనాడో ఓగంగమ్మొదినా
నారాతలేమిరాశాడో ఓగంగమ్మొదినా

---

# ౧౫౮ నెరబండి

— బండి. మానవ కోటికి పూర్వజన్మము తెలియజేసే చిందుస్రలు కావాలి. అందుకే ప్రయాణమన్న అందరికీ అంతయిష్టము. బండి, నాటినుండి నేటివరకూ [illegible] ఎన్ని జంటలనో వలెసే బండి [illegible].

నెరా నెరా నెరబండి
నీలమోరి బండి ...నెరా
అద్దరేతిరికాడ నిద్దారోతుంటేను
బండెక్కు బండెక్కుమన్నాడెబావ ...నెరా
జల్తారి సీరకట్టి జడకుచ్చులెనకట్టి
నిలుసుంటె నాకేసి ఎగాదిగా సూసేడు ...నెరా
పుల్లెద్దు బండికట్టి తెల్లెద్దు బండికట్టి
పుల్లెద్దు తెల్లెద్దు ఏకమైనాయి ...నెరా
ఎద్దులకి మువ్వలుకట్టి నాతల్లో పువ్వులుపెట్టి
మువ్వలుసప్పుడు పువ్వుల వాసన ఒకటైపోయినాయి ...నెరా
మూటకట్టమన్నాడు ముల్లెకట్టమన్నాడు
మూటముల్లెకట్టి ఎనకెక్కమన్నాడు ...నెరా
పాటలు పాడుకుంటూ మాటాలాడుకుంటూ
కమిసి కర్రొట్టుకొని ఎనకాలెక్కాడు ...నెరా
గట్టంటె గట్టుకాదు పుట్టంటె పుట్టకాదు
గతుకుల్లో మాబావ సతికిల్లబడ్డాడె ...నెరా
పక్కవల్లంలోను చెక్కబెల్లం వుంటేను

బండినిలిపి బెల్లాము భోంచేసినాడో ...నెరా

వర్సాము కురిసింది వానయినాకురిసింది

వర్సాము వానాలో తడిసీపోయేము ...నెరా

సిట్టడవి దాటేము పొట్టడవి దాటేము

అన్నడవిలు దాటేసి ఐక్యామైపోయేము ...నెరా

వారు పొందని అనుభవాలు లేవు. గతుకులలో పడి వర్షములో తడిసి అడవులన్నీ దాటి "అనంత పథాలకు ప్రయాణమైనారు".

ఎక్కానరనూ బండెక్కానరనూ
ఎక్కిన బండి దిగొద్దు నరనూ ॥

అన్న పాట దీని తరువాతిది.

---

## ౧౫౯ కన్నెగోర - చిన్నచిల్క

— సంఘములోనుంచి దాటిపోయి ఏతోటలోనో కొమ్మల మీద కులుకుతూ పాడుకుంటు న్నారు ప్రేయసీ ప్రియులు.

మొవ్వాకు చీరపెడతా ! మొగలిరేకులుపెడతా!
నన్నూపెళ్లాడ్తావా ? కన్నెగోరా ? ॥ మొ ॥
ముద్దూటుంగరముబెట్టి । ముత్యాలపేరుగట్టి
నిన్నే పెళ్లాడతాను ; చిన్నచిల్కా ! ॥ ము ॥
ఉల్లీ పిల్లేళ్లుచేస్తా ! మొల్లాతలంబ్రాలుపోస్తా
నన్నూపెళ్లాడతావ ! కన్నెగోరా ! ॥ ఉ ॥
పసుపూ పాదాలు కడిగి । పచ్చాటంగీతొడిగి
నిన్నేపెళ్లాడతాను । చిన్నచిల్కా ॥ ప ॥
గచ్చాగజ్జియలుపెడతా । పచ్చాకుతాళిగడతా ।
నన్నూపెళ్లాడతావా ? కన్నెగోరా ॥ గ ॥
మణుల దీపాలుతెచ్చి । మంగళహారతులిచ్చి.
నిన్నేపెళ్లాడతాను । చిన్నచిల్కా ॥ మ ॥

గోరవంక అనగా ఆడుచిలక అన్న అర్థము చేసినాడు ప్రాకృత రచయిత.

---

# ౧౬౦ నేచిన్నదాన్నిరా

—ఇది యెవరో చిన్నతనము వడలకుండనే తొందరపడినది. చేయికాలిన పిదప
పట్టుకొను చున్నది.

వడ్లతట్టెత్తుకోని – వలసలకు నేబోతె
వలసలో నాకొప్పు – గొలుసూడెరాజా

బాలరో నే చిన్నదాన్నిరా !
చెలియరో నేచిన్నదాన్నిరా !

ఈదులకుంటాకు – నీళ్లకు నేబోతె
ఈతముల్లూ తగిలి – ఈడేరెరాజా

బాలరో నేచిన్నదాన్నిరా
చెలియరో నేచిన్నదాన్నిరా

కడియాల కుంటాకు – నీళ్లకు నేబోతె
కవిలిముల్లూతగిలి – కడుపాయెరాజా

బాలరో నేచిన్నదాన్నిరా
చెలియరో నేచిన్నదాన్నిరా

తుమ్మాలకుంటాకు – నీళ్లకు నేబోతె
తుమ్మముల్లూ తగిలి – తిమ్మణ్ణి నేగంటి

బాలరో నేచిన్నదాన్నిరా

అల్లొనేరెడుపండు – అరచేతులుండంగ
పసిపింద కొరికినా – ఫలమేమిరాజా
బాలరోనేచిన్నదాన్నిరా
చెలియరోనేచిన్నదాన్నిరా
తుమ్మెదలు చెలరేగి – దూలాలు లోలవంగ
మొగసాలికేమన్న – మోసమారాజా
బాలరోనేచిన్నదాన్నిరా
చెలియరోనేచిన్నదాన్నిరా

---

## ౧౬౧ నాయుడు

—ఇది పక్కా వీధిసాని, రూపాయలు, కాసులు, ముక్కుపుడక కడియాలు, పావడలు, నాగరము, మట్టెలూ ఎన్నో ప్రణుకు కున్నది. చివ్వరికి ? వినండి.

నాయుడోళ్ళింటికాడ । నల్లతుమ్మచెట్టుకాడ,
నాయుడేమన్నాడేపిల్లా ? అబ్బ; ఎంతవింతగున్నాదేపిల్లా !
నాయిడోళ్ళింటికాడ । నల్లతుమ్మచెట్టుకాడ
నాలుగు రూపాయలిస్తానన్నాడమ్మా ! అబ్బ నాగుండె
ఝల్లుమన్నదేలమ్మా
కోమటోరింటికాడ । గున్నమామిడిచెట్టుకాడ
కోరికోరేమన్నాడేపిల్లా ?
కోమటోరింటికాడ । కొట్టుబాజారుకాడ
కోరి; కోరి; రమ్మన్నాడమ్మా !
కరణంగారింటికాడ । కారుములకచెట్టుకాడ,
కాముడేమన్నాడేపిల్లా ?
కరణంగారింటికాడ । కన్నిమామిడిచెట్టుకిౕంద
కాసులుపేరిస్తానన్నాడమ్మా !
మునసబుగారింటికాడ । ముందల దరవాజుకాడ
ఆతడేమన్నాడే పిల్లా ?
మునసబుగారింటికాడ । ముందలదరవాజులోన
ముక్కుపుడకలిస్తా నన్నాడమ్మా !

మాలపల్లి తూముకాడ । మల్లెపువ్వులతోటకాడ
బాలుడేమన్నాడేపిల్లా ?
మాలపల్లితూముకాడ । మల్లెపువ్వుల పందిరిక్రింద
మల్లి, మల్లి, రమ్మన్నాడమ్మా !
క్రిందవి కడియాలు । మీదవి పావడాలు
నెత్తిమీదనాగరము । ఏదేవుడిచ్చేడే పిల్లా ! ॥ అబ్బ ॥
కడియాలు, కామరాజు । పావడాలు పాపయ్య
నాగరము నాగరాజు । నన్ను కోరి, కోరి; యిచ్చేరమ్మా !
ముంతంత కొప్పుమీద । మూడు చేమంతిపూలు
ఏరాజుపెట్టేడమ్మా । అబ్బ । ఎంతచక్కగున్నావే పిల్లా !
చేమంతి పువ్వూలు । చెంగూలోనజెట్టి
కోరి, కోరి; పిలిచేడె । నాయుడు
అబ్బగుండె ఝల్లు మన్నాదమ్మా !
కాళ్లకు కడియాలు । వ్రేళ్లకు మట్టెలూ
నాయుడెప్పుడిచ్చేడే పిల్లా ?
కాసులుపేరు వేసుకొని । కాలువగట్టున వెళ్లుతుంటె
కాని పట్టుపట్టాడే నాయుడు । ॥ అబ్బ ॥
ఎలమంచలి రోడ్డుమీద । తాలూకాకచేరికాడ
తాళపాలెం రేవులోన । పిట్లకోనేరుకాడ
ఎగిరి, యెగిరి [illegible] కమ్మ [illegible] ॥ అ ॥

## ౧౽౨. ఒంటి బ్రతుకు

అంచి యామనికొండ పక్కనాపెనుగొండ
పై దళము రాకుండ పారింది జండా
ఒంటినేనుండలేనో చందమామా
ఒక్కదానీ కోనలో
ఏనూరు ఏతాలు ఇన్నూరు కాలువలు
ఎంత చక్కని దయ్యా ఈపూలవనమూ || ఒంటి ||
మంచి నీళ్లాబావి మనపెరటనుంచుకొని
ఉప్పు నీళ్లకు బోవ ఉపకారమేమో || ఒంటి ||
మల్లెపూలాతోట మనపెరట పెట్టుకొని
చీకిపూలకు బోవ సింగారమేమో || ఒంటి ||
దవణ మేసినరాజు కల్లనాటకపోయె
కావిలుండకపోయె
ఎనలేని దవనంబు ఏటిపాలాయె
ఒంటినే నుండలేనో చందమామా
ఒక్కదానీ కోనలో

ఒంటి బ్రదుకు వద్దట ఈ పిల్లకు. ఇక నేమి? ఊరిముందరిచేను! కాకులకు పండుగ.

---

## ౧౬౩ చెయ్యిమీద చెయ్యి

దూరిసూడదూ దుక్కిసూడదూ, దున్నపోతుల మడకసూడదూ
వుండరాదుర ముండమోపులూ, బంగారిసామి
ఉండరాదుర ముండమోపులూ
అరుగంపాదూరుగంపా, బాలుడేసిన తుమ్మకంపా
తుమ్మకంపలు దూరిపోతబ్బీ, బంగారిసామీ
తుమ్మముల్లు రొమ్మునాటేనూ
అంచునంచున వరుసలేసీ, పంచవన్నె ముగ్గులేసీ
అరుగుమీదాపండుకొంటీరా, బంగారిసామీ
ఆడుదానీ బానలేడరా
ఏటిగడ్డా సేనినాడా, ఏపకవురూ మంచెవాడా
ఎన్నుమీ ° . ఎవ్వవాలెనురా, బంగారిసామి
సెయ్యిమీదా సెయ్యిదియ్యిరా !

ఎవరో చూచుచున్నారని సూచన !

---

# ౧౬౪ పత్తిచేను

సూరేపల్లి ముద్దుల బావను చూచేదెన్నటికో
ఊరిముందటి పత్తిచేను వేసేదెన్నటికో
అదిపూసే దెన్నటికో మరి
కాసేదెన్నటికో

మొదట ముద్దుల బావను ఈముగ్ధ ఊరిముందటి ప్రత్తిచేనిలో కలసినది; మరల గలియుటకు ఆ పరిస్థితులే రావలెనని ఎదురు చూచుచున్న ఈ వెఱ్ఱి "పండి తెల్లబాఱు వరి తోటలను జూచి" మొగము వంచి యేడ్చు మహిందుని ముగ్ధకు చెల్లెలు కావలయును. మొదటి పాదము తీసివేస్తే శాలివాహన సప్తశతిలోనికి ఈపాట సులువుగ ప్రవేశించగలదు.

---

## ౧౬౫ రెడ్డోళ్ల జీతగాడా

రెడ్డోళ్ల జీతగాడా మేలైనమొనగాడా
అబలగు బలతలుపు ఐదంకణాల యిల్లు
ఆ యిల్లు తిరిగిరారా ననుముద్దులాడిపోరా ॥
నడివీధిలోనయిల్లు బాజారులోన బావి
ఆ బావికాడరారా నాబానలందుకోరా ॥
సందులోన గుడి నడివీధిలోన సరస
నాగోటిమీదతేరు ఆతేరు తిరిగిరారా
నాతేటలందుకోరా ॥ రెడ్డోళ్ల ॥
నువు సుట్టమురీతిరారా నువుసుట్టకాలుతేరా
నను చూచిపైన పోరా ॥
నా అబలగు బలతలుపు ఐదంకణాలమిద్దె
ఆ మిద్దె తిరిగిరారా ననుముద్దు లాడిపోరా ॥
జిల్లేడమ్మ జిట్టనా మనోరాజమొగ్గ
నా మల్లెపూలజెండా నాముంత మామిడిపండా
నా యింపుమీదసొంపు నా సొంపుమీద యింపు ॥
నువువస్తానంటెచాలు నామగనికంటె మేలు
నిన్నెట్లు మరచిపోదు
ఇట్లవానిపొందు నేనెట్లు మరచియుందు ॥
నీ చేతిలోన ఉంగ్రం నా చేతికీయరాదా

నా వేలికి పెట్టుకోనా పదిమందిలోకిపోనా
నీకు పేరుతేనా
చక్కాని నీటుకాడా చక్కాని బొమ్మరారా
నీ చేతిలోని అబయా నా చేతికిచ్చిపోరా
రెడ్డోళ్ల జీతగాడా మేలైన మొనగాడా

వాడు రెడ్డోళ్ల జీతగాడు. సరకాపు సంబళమందుకొని 'దుప్పాటి చెరగు నందాన దూవాండ్లై' నా తెచ్చి ఇస్వాడా అని పిల్ల ఆశ.

---

# ౧౬౬ బంగారుసామి

అద్దాల మహాలులోని
ఓరబ్బా, బంగరిసామీ !

ఇట్ల రాని పోని మాటలకే
వాదాడబోకురో !
రబ్బే ! బంగరిసామీ !

ఊటికాయల కాల మొచ్చెనురో ॥
రబ్బే ! బంగరిసామీ !

ఉబ్బింది—దాని మొగము
వుబ్బితే వుబ్బింది గాని
సబ్బుయేసి రుద్దరో !
రబ్బే ! బంగరిసామీ ॥

కలే కాయల కాల మొచ్చె
కత్తె పిల్లకు ప్రాయ మొచ్చె
సుట్ట గాల్చుకున్నట్టు దాని
సుట్టింటి కెడతావు; దాని
సుట్టూర దిరుగుతవో !
రబ్బే ! బంగరిసామీ ॥

ఎగవ సేలో గెడ్డి గోసి
దిగవ సేలో మోపు గట్టి
ఇట మోపెత్తి పొమ్మంటే
కొంగు లాగి పోతి వేమిరో ॥

రబ్బ! బంగరిసామీ!

గూడలేసె గుంటకాడ
కబిల్దోలె బాయికాడ—
ఇట్ట వజ్జరాల వాన గురిసె
విడవరింక కబిలవో రబ్బ!

రాజా! నా బంగరిసామీ ॥

———

## ౧౬౭ బైరన్న

— ఇది పక్కా రంకులాడి కథ. కుంటైన మగనికి ఉపాయములు చెప్పుచున్నది.

అప్పనా తనామన మారోరిబైరనా
మారోరి బైరన రాగోరె బైరనా అప్పనా

ఇంటి ముందు యీతపొద
ఇంటి యెనక గచ్చపొద
ఒంటిగాను రాబోకు
ఒరుల జిక్కి పోదువురా అప్పనా

సవతితల్లి పెట్టుపోత
పగలురేయి కత్తికోత
గుమ్మమైన దాటనీరు
గుసగుసలు ఆడనీరు అప్పనా

రాత్రిరెండు జాములకు
రావిచెట్టు కిందనుండు
యింట్లోవారు సూడకుండ
ఎటులొనిను కలసెదరా అప్పనా

వచ్చెబోయె దారిలోను
పిచ్చికుక్కలున్నవిరా

మచ్చుజల్లి పోయెదరు
మాయలో పడబోకుమురా అప్పనా

నీకు నాకు జోడుగాన
నిమ్మపూల తెప్పమీద
తేలిపోవ మనసు పుట్టె
తెల్లవారు చెప్పవుడురా అప్పనా

ఎప్పుడిల్లు విడిచెదనో
ఎపుడునిను చూచెదనో
చిత్తమూ చెదిరిపోయే
కత్తికోత లాగనుండి అప్పనా

---

# ౧౬౮ కొయ్యోడ

— కొయ్యోడు పాటలు ఉత్తర విశాఖ మండలములో చాల ఉన్నవి. ఇది అసలుపాటయో అను కరణమో తెలియరాదు. రచనా సంపూర్ణతను గురిస్తే ఇది నాగరికుల రచన లాగే అగుపడుచున్నది.

చుక్కలకోకా కట్టుకోని
చుట్టూగోడు రైకా తొడిగి
బుట్ట నున్నగ దువ్వ్యాకోని
బొట్టూ కాటుక పెట్టూకోని
నోటికి చుట్ట పెట్టూకోని
గోటుగాను నడుచుకుంటూ
చక్కదనమే చూసుకుంటూ
ఎక్కడి కెల్తవు చిట్టెమ్మంటే
పోలేరమ్మ మెరకల మీదికి
పుల్లల కెల్తము కొయ్యోడో
రయ్యో కొయ్యోడా ॥
కఱ్ఱ చేత పట్టుకోని
కిఱ్ఱూ చెప్పులు తొడుగూ కోని
పాయల మొల్తాడేసుకోని
కాయి పంచలు కట్టుకోని
వక్కలాకులు వేసూకోని
ఎక్కడి కెల్తవు కొయ్యోడంటె

పోలేరమ్మ మొరకల మీదికి
పొగాకు కొల్తను చిట్టమ్మీ
లమ్మీ చిట్టమ్మీ
చీటికి మాటికి చిట్టమ్మంటా
చీటికి మాటికి చిట్టమ్మంటా
చిట్టమ్మున్న నడీధిలోను
చిన బాబుంతడు పెదబాబుంతడు
కరణాలుంటరు కాపూలుంటరు
చిట్టమ్మానీ పిలవకురో రయ్యో కోయ్యోడ ॥
నేకుంద న్నాయుడి కూతుర్నిరో
రయ్యో కోయ్యోడ ॥
అబ్బోఅబ్బో అలాగునైతే
కురసా కురసా మొక్కలపీటా
కుంద న్నాయుడి కూతురివా
నేమద్దెప్పయ్య మనవణ్ణే
లమ్మీ చిట్టమ్మి

ఇంటికి తగిన యిల్లాలురో ॥ రయ్యోకోయ్యోడ ॥ ఇది అసలు పాటలోని భాగము వలెనే ఉన్నది.

---

## ౧౬౯ కొయ్యోడు పాట

పల్లవి : అయ్యో : కొయ్యోడ :

అ : ప : ఓరింట్లో తిండికి, లేక పోయింది
బైటబడాయి కొట్టకుకో రయ్యో కొయ్యోడ ॥ అ ॥

1 చ : కొయ్యోడ కొయ్యోడ, బంఢంటూరు
వానికి బండికి । బస్తలు లేవంట
వాడికొడుకే । మట్టి బెట్టంట
వాడిపెళ్లం । సూరకత్తంట
ఆగుంటకు నీకు । తగునంటోరి ॥ అ ॥

2 చ : కలిగినకంట్లో । కాటుకబెడితే
నాకన్ను మెరమెర । లాడెరోరయ్యోకొయ్యోడ
దానిమరిగిన మొగుడు । పొరుగుననుంటె
మనసు మెరమెర । లాడెరోరయ్యో కొయ్యోడ ॥

3 చ : అందము నందము । లేని మొగుండు
వాడు సందేదుంటే । ఎందుకోరయ్యోరొ-యొయ్యోడ
ఎదిగిన పిల్లను । యింట్లోబెట్టి
బైట మంచం । ఎయ్యకురో రయ్యోరొ-యొయ్యోడ

4 చిట్టెమ్మ వచ్చిన । ముహూర్తమునుండి
దొడ్డెడు గేదలు । చచ్చేనురో ॥ ర ॥
దొడ్డెడు గేదెలు । చస్తే; చచ్చేనూ

ఇదికూడ వెలిచవి మరిగిన వెలది తలపులనే తెచ్చిచూపించుపాట. ప్రాకృతుల జావళీయా అనిపించుచున్నది. 'పోలీసు వెంకటస్వామి' అనే బూతులబుంగ ఒకపాట ఉన్నది. ఈ కోవలో పెక్కుటు పాటలున్న వన్నమాట.

## ౧౨౦ వాలుకన్నుల వెంకటస్వామి

ఓ వాలు గన్నుల మువ్వ వెంకటస్వామి
నిన్ను నేను విడువ జాలరా;

ఇంటిముంగల ఇనపరోలు
సేతిస శాబంతి రోకలి
దంచి దంచి నీవంక సూసితే
ధరణి మీద కాలునిలువదు వెంకటస్వామి
నిన్ను నేను మరవ జాలరా; || ఓవాలు ||

ఉంటే ఈవూళ్లో ఉండు
పోతే పొరుగు దేశం వెళ్ళు
సుట్టు పట్టుల ఏ మూలనున్న
సూడక నామనస్సుండా దెంకటస్వామి
నిన్ను నేను మరవ జాలరా; || ఓవాలు ||

ఎర్ర సెరువు వాలుగు ముక్కలు
గోల కొండ గుల్లసింతపండు
ఆవాలు ధనియాలు వేసి వండితే
ఆవాసనకి సుట్టు తిరిగే వెంకటస్వామి
నిన్ను నేను మరువ జాలరా; || ఓవాలు ||

ఓ అందకాడ నాకోడెకాడ
సందె కాడను గోడదూకి
తొంగి చూడ గడబిడాయెను
నాబంగారు మామ వెంకటస్వామి
నిన్ను నేను మరువ జాలరా; || ఓవాలు ||

# ౧౭౧ పయనము

— ఇది ఎవరో ప్రాకృతుల శైలావలె నున్నది. ప్రాస - అన్త్యప్రాస కావలెను - పయనపు పాటను దయగలసామిద్వారా వలపుకానికి తెలుపుచున్నది.

ఒండుకోను ఒడ్డెపల్లె పండుకోను పల్లెరెకుచ్చి,
ఒల్లకుంటే గొల్లపల్లెయ్యా, దయగల్లసామీ
రేపుపయనామాని దెల్పాకోయి

మిట్టలెక్కి చూసువాడ ముష్టికాకర సెట్టుకాడ
ముద్దు ముద్దు గలసిపోయేరా, దయగల్లసామీ
రేపు పయనామాని దెల్పారా

కానరానీ గట్టుమీదా కమ్మగెగ్గెర సెట్టుకాడ
కారణాలు సెల్లిపోయెరా, దయగల్లసామీ
రేపు పయనామాని దెల్పరా

నీళ్లులారా నిమ్మలారా నిత్యబూసిన మల్లెలారా
నీళ్లకొచ్చిన నీళ్లగన్నోయి, దయగల్లసామీ
రేపు పయనామాని దెల్పరా

“ఈటికీ యేడామడేటికీ యేడామడెల్లుట్ల దురగమూ అత్తిల్లుసేబోతిరా సిన్నోడ పుట్టిల్లు దవ్వాయెరా మరసినావురుపురాదోయి మరువల్ల సీమోడరా” అన్న పదము ఈకోవలోనిదే.

---

## ౧౭౨ మొక్కులు

మొక్కిన మొక్కులు సల్లగుండీ
మొగుడి కళ్లుపోతే - నా
మొగుడి కళ్లుపోతే
కట్టమీది ఆ అంకాళ్లమ్మకు
పెట్టకోళ్లనిస్తా
దండుకుపోయిన యిద్దరు మరుదులు
గుండ్లు తగిలి సస్తే-పెద్ద
గుండ్లు తగిలి సస్తే
సాతులూరి యా పోతురాజుకు
మేకపోతునిస్తు
సంకనవున్నా చంటిబిడ్డకు
సన్నిగొట్టిపోతే-మాయ
సన్నిగొట్టిపోతే
సత్తైన పిల్లి గోపాలుడికి
నిత్తెం పూజసేతు ॥

దీనికి వ్యాఖ్యానము దండుగ. ఉపపతికి సొమ్ముచాలదు. ఉనికి అత్తింటనే సౌఖ్యము. ఆనుకూల్యత కొఱకు మాత్రమే మొక్కుకుంటున్నది.

---

## ౩౩ బేరము

వస్తానుగాని మామ వస్తానుగానీ...నన్ను
కొట్టకుండ తిట్టకుండ పెట్టుకుంటావా? నిన్ను
కొట్టకుండ తిట్టకుండ పెట్టుకుంటాను నువ్వు
యెవరితోను మాట్లాడకుండ వుంటావు కదా?
యెవరితోను మాట్లాడకుండవుంటాను కాని నే
నవ్వేటి నవ్వు మొఖం యెట్లపెట్టేది?
నవ్వేటి నవ్వుమొఖం అట్లపెట్తేను నా
చేతిలోవుండె చారకోలు చెండాడదా?
చేతిలోవుండె చారకోలు చెండాడితే నా
నోట్లోవుండె బండమాట బయటెల్లదా?
నోట్లోవుండె బండమాట బయటెల్లితే నా
కాళ్లవుండె కిర్రుజోడు దవడాడదా? నీ
కాళ్లవుండె కిర్రుజోడు దవడాడితే నా
అమ్మగారింటికీ నేనెళ్లనా నీ
అమ్మగారింటికీ నీవెళ్లితే నే
కొట్టకుంట తిట్టకుండ తోడ్కొనిరానా?
కొట్టకుండ తిట్టకుండ తోడ్కొనొస్తే నే
కూడునీళ్లు వండకుండ దిగనూకనా
కూడునీళ్లు వండకుండ దిగనూకితే నే

సేద్యానికి పోకుండ యెగనూకనా ?

సేద్యానికి పోకుండ యెగనూకితే

భావిలోవున్న గుంటలోన నేనుపడనా

భావిలోవున్న గుంటలోన నీవుపడితే

వెట్టోణ్ణి పిలిపించి యెత్తించనా ?

వెట్టోణ్ణి పిలిపించి యెత్తించితే నే

దెయ్యమై భూతమై నిన్నుపట్టనా

దెయ్యమై భూతమై నన్నుపట్టితే నే

వైదుగుణ్ణి పిలిపించి వదలగొట్టనా

వైదుగుణ్ణి పిలిపించి వదలగొట్టితే నే

తిరుపతికొండెక్కి తిరిగిచూడనా

తిరుపతికొండెక్కి తిరిగిచూసితే నే

బెంగపురి కొండెక్కి బిందొక్కనా ?

ఈ రకపు పాటల తునకలు పెక్కులు. దీనియంత పెద్దది అచ్చులో వచ్చినట్లులేదు. కావలిలో ఒక ఓచ్చగానికద్ద రాసుకున్నది.

# ౧౨౪ బొల్లారపిల్ల

—చెడిన పిల్లను ఉంపుడుకత్తెనుగా చేసుకున్నాడు వీడు. కులము చెడిన బొల్లారపిల్ల ఏమిచేయగలదు ? అన్నలే చెయ్యలేకపోయిరి.

పెట్టీపోస్తావుంట పైనిండ బట్టలుపెడ్త
నాపేరుమీద బతుకవే ఓబొల్లారపిల్లా !
అచ్చాము తెల్లచీర అంచూన జిల్లెడు గొమ్మ
నీ కొంగున రామచిలుకలే ఓబొల్లారపిల్లా !
బాయిల యిల్లుగట్టి బొజ్జోడు యెంట వడితె
కుంటోడు కులము జెరిపెనే ఓబొల్లారపిల్లా !
నీ కాలుకు నామట్టె నాసేతులున్నకట్టె
నిను కొట్లకుంటె-ఒట్టెనే ఓబొల్లారపిల్లా !
సంకల సప్పైతట్టా సేతుల సీపురుకట్టా
నీయెంట జెమానెందుకే ఓబొల్లారపిల్లా !
బండమీద బలిజోల్లు బాగోతులాడంగా
బాగతన్నుల్ తింటివే ఓబొల్లారపిల్లా !
దొరగారి జీతగాడు దొరెడ్లమేపెటోడు
దొడ్డెక్కి సీటిగొట్టెనే ఓబొల్లారపిల్లా !
పటేండ్ల జీతగాడు పైఎడ్లమేపెటోడు
బండమీద సీటిగొట్టెనే ఓబొల్లారపిల్లా !
దిగింది డిచ్చువెళ్ళి పోయింది సుద్దవెళ్ళి

పని జేసెసాంపెల్లి ఓబొల్లారపిల్లా !
ఇందూర్ల నాదియిల్లు మారుకట్టుకు నాదిమడిగె
మాసాల కన్నరావమ్మా ఓ బొల్లార పిల్లా !
బొంబాయిల బొట్లసీరె కనుకుట్ల కనులరైకె
నీ కొంగున మల్లెమొగ్గలే ఓ బొల్లార పిల్లా !
బొంబాయిల బొంగులొర్రే యిందూర్లె గంటలేగే
మనరజా ఎత్తిపోతదే ఓ బొల్లార పిల్లా !
కలకలయనబోకు కన్నీరుదియ్యబోకు
మన అంతు నుంచె తప్పదే ఓబొల్లార పిల్లా !
యిందూర్ల జోగిపేట నీ అన్నలున్నారాట
నన్నేమి జెయ్యజాలరే ఓబొల్లార పిల్లా !

---

## ౧౭౫ పడవపాట

—ఇది తనకంటె చిన్నవానితో సరసములు మరిగినది. తను వెక్కపాట తిట్లు ప్రారంభించినది.

రావూ నేరమ్మంటె । పోవూ నేపొమ్మంటె
రవ్వాచేసెదవేమిరా ! నీవెంతో
రాలూగాయైపోతివిరా ॥
మల్లెపందిరికాడ మంచమేసి పరుపేసి
తెల్లాదుప్పటిపరచినా – దానిపై
మల్లేమొగ్గలు చల్లినా ॥
పూలాచీరాగట్టి పూసలరైకా తొడిగి
నీలాల కొప్పూపెట్టినా – దానిపై
పూలాదండలెచుట్టినా ॥
నోట తాంబూలమూసి కాటికా కన్నీరుగార
మాటమాని నేనుండినా – దానిపై
తోటికోడల్ దొమ్ములాడి నా ॥
పుట్టింటికి పోదమాని పట్టూపట్టీ నేనిండా
పట్టిడీ తాపిపారేసినా – దానిపై
పట్టుపట్టి విడిలించినా

---

## ౧౭౬ రానుపోర

రానుపోర గొల్లోడ రాతిరి నల్లోడ
నన్ను నీవెరగవా

౧

కన్నుగిరతలలోనె కనుగొన్నావా
రానుపోర గొల్లోడ రాతిరి నల్లోడా

౨

తొమ్మిదిచేరలా తూగుటుయ్యాలలో
ఏజోలిలేకున్న నాజోలినీకేల
రానుపోర గొల్లాడ రాతిరి నల్లోడ

౩

నిండుపున్నమనాడు పండువెన్నెలలోన
పరుపున్న లొట్టెలో పండినిండున్నాను
రానుపోర గొల్లోడ రాతిరి నల్లోడ.

ఇది కృష్ణునిమీద పాట. చరణములు చాలాఉన్నట్టు కనబడుతున్నది. హాస్యపుపాటలుఅన్న చిల్లర పుస్తకములో ముక్తికాంతయే ఈ మాటలంటున్నట్టుగా ఉన్నది.
శృంగారములో ప్రేమముదిరితే భక్తి అయిపోవుటను వింతఏమిటి ?

## ౧౭౭ కూనలమ్మ పదాలు

—కూనలమ్మ పాట ఒక దేవతకి సంబంధించిన పాట. కూనలమ్మ పార్వతీదేవి కూతుళ్లు కామేశ్వరీదేవికి తోబుట్టువులూ అయిన అక్కలకు కావగు పోతురాజునకు భార్య. కూనలమ్మ సంకీర్తనములు, కూనలమ్మ చీర, కూనలమ్మకు వేటు, కావ్యాలలోనున్నా పాటలలో నున్నా వినబడుతునే ఉంటవి. ఈ 'పదము' తక్కిన పదకావ్యములవలె జంపెవరుసలో నడుస్తున్నది. చరణములన్నీ దొరికిన బాగుండియుండును.

అన్నమిచ్చిన వాని । నాలినిచ్చినవాని
నపహసించుట, హాని । ఓకూనలమ్మా !
ఆడితప్పినవాని । నాలినేలనివాని
నాదరించుట హాని । ఓకూనలమ్మా !
భీష్ముఁడనుభవశాలి । భీముఁడే బలశాలి
కర్ణుఁడే గుణశాలి । ఓకూనలమ్మా !
దుర్యోధనుఁడు భోగి । ధర్మరాజొక జోగి
అర్జునుండే యోగి । ఓకూనలమ్మా !
కవితారసపుజల్లు । ఖడ్గాల గలగల్లు
కరణాలకే చెల్లు । ఓకూనలమ్మా !
కాపువాఁడే రెడ్డి । గరికపోచేగడ్డి
కానకుంటే గుడ్డి । ఓకూనలమ్మా !
మగని మాటకు, మాటి । కెదురుబల్కెడిబోటి
మృత్యుదేవత సాటి । ఓకూనలమ్మా !
జపతపంబుల కన్న । చదువుసాములకన్న
ఉపకారమే మిన్న । ఓకూనలమ్మా !

---

# ౧౭౮ పేట్రాయిసామి దేవుడా

—పేట్రాయి, బెట్రాయి, ప్రేట్రాయి అనిపాఠభేదాలున్నవి. ఇది అవతార కీర్తన. అవతారాలను గురించిన సుదీర్ఘరచనలున్నవని శ్రీ తూమాటి దోణప్పగారు చెప్పిరి. ఈపాటలో అచ్చయిన కొన్ని పాఠములలో వలె నాగరికుల సమాసకల్పనము లేదు.

పేట్రాయి సామి దేవుడా మమ్మేలినోడ
పేట్రాయి సామి దేవుడా
కాటమిరాయుడా కదిరి నరసిమ్ముడా
నీకైన యాలకాడ నిన్నెగోరి నమ్మినాడ ॥ పేట్రాయి ॥
చేపకడుపున చేరిపుడితివి—రాకాసిగాని
కోపమూని కోరికొడితివి
ఆపెన్నీటిలోన ఒలసి గ్రక్కున దూరి
బాపనోళ్ల సదువులెల్ల బెమ్మదేవుడికిచ్చినోడ ॥
తాబేలై తాను పుట్టగా ఆనీళ్ల కాడ
దేవాసురెల్ల గూడగా
తావుసూసి కొండ కింద దూరగానె సిల్కినపుడు
చావులేని వెన్నమందు దేవర్ల కిచ్చినోడ ॥
అందగాడవపుడు లేవయ్యా—గోపాలగో
విందరచ్చింపరావయా
పందిలోన సెరుకోని పంట భూమి నెత్తి కింగ
సిందర సిందర సేసీనట్టి సందమామనీ వెకావ ॥

నారసిమ్మ నిన్నెనమ్మితీ–నానాటనే
కోరితినీ పాదమేగతి
ఘోర కొలువు కంబాన–సేరిపెమలాదుగాసి
కోర మీసమైన శత్రు గుండెలగల జీల్చినోడ
బుడుత భాపనయ్య వైతివీ–ఆచక్రవర్తి
నడిగి భూమి గెలుసు కొంటివీ
పొడుగు కాళ్లోడవై అడుగువానిమీదబెట్టి
తడవులేక లోకమెల్లపుడికొన్ని తిరిగినోడ ॥
రెండు పదులు వొక్కమారుతో ఆదొర్ల!నెల్ల
చెండాడి తౌర పరశుతో
చండ కోలబట్టి కో
దండ రామసామి కాడ
చెండు కోల సేసుకోని
కొండ కప్పుడేగినోడ ॥
రామదేవ రచ్చింపరా మాకెల్ల
భూమిలోన బుద్ధిసెప్పరా
ఏమి తప్పు సేసినాడ సామినాయప్పబుద్ధి
నీమనసు చల్లదనము మామీదసూపగోరి ॥
దేవక్క దేవి కొడుకురా మాకెల్ల
దేవుడై నిల్చినావురా
ఆవులమేపి కోని ఆడోళ్ల గూడుకోని
తావు బాగసేసికోని తకిడి చిక్కడి సేసినోడ ॥

వేదాల నమ్మరాదనీ–చాత్రముల
వాదాలు బాగులేదనీ
బోధాలు సేసికోని బుద్దులు సెప్పికొన్న
నాదవి నోదనయ్య నల్లనయ్య నీవెకావ ॥
కలికి నాదొరవు నీవెరా నాతోష
పలకవేమి బాలకృష్ణుడా
సిల్లగట్టు పురమునందు సిన్నిగోపాలుడై
పిల్లగోవి పట్టుకొని పేటపేట తిరిగినోడ ॥

చిల్లగట్టుపురము ఏదియో ? కవిరికి చుట్టుపట్లు ఉండవలెను.

## ౧౭౫ ఈశ్వరా జగదీశ్వరా

ఈశ్వరా పరమేశ్వరా జగదీశ్వరా కరుణింపరా
శాశ్వతుడవని వేడితిని విశ్వాసముంచర యీశ్వరా
ముందుజేసిన పూర్వకృతములు ఇందుబాపుము యీశ్వరా
పొందుగా మీపాదపద్మము జెందియుంటిని యీశ్వరా
కపట విద్యలు నేర్చి పొట్టగడుపుచుంటిని యీశ్వరా
నేపములెన్నక నన్ను నీకృప నేలుమీపరమేశ్వరా
ఆరుగురు శత్రువులునాపై క్రూరమెంచిరి యీశ్వరా
పరమ మంత్రముచేత శత్రుల నణచవలె పరమేశ్వరా
తొమ్మిది ద్వారములకొంపిది నమ్మనేటికి యీశ్వరా
బొమ్మలాటపాలుచేసి బ్రోవకుంటివి యీశ్వరా
మూడుగుణములు విడువజాలక మోసపోతిని యీశ్వరా
వేడ్కతోనీ మాయదాటనుపాయమేదో యీశ్వరా
చంకదుడ్డె మకింకరులకు జంకనేరను యీశ్వరా
అంకమందునజేర్చి సద్గురు శంకదీర్చర యీశ్వరా

ఇది యెడ్ల రామదాసుది. తరుచు వినబడుతుంది.

# ౧౮౦ బైరాగి

—చివ్వర ఘటాకాశ ప్రశంస ఉన్నప్పటికీ ఇది నీతి, శమదమాది గుణసంపత్తి బోధించే పాటయే.

నాదబ్రహ్మానంద యోగీ వీడు
వేదాంతసారము వినిచే బైరాగీ
రాజసంబు దుఃఖదమురా, ఘన
రాజయోగమార్గమే సౌఖ్యదమురా ‖ నాద ‖
చిత్తశుద్ధి గల్గియుండు, భక్తి
జేరిసద్గురు నీవు సేవించుచుండు ‖ నాద ‖
మత్తత్వములేకయుండు, స
మస్తమింద్రజాలమంచూరకుండూ ‖ నాద ‖
పెద్దల నిందించవలదూ, ఒరులు
పీడించినా నీవు భీతిల్లవలదూ ‖ నాద ‖
వనితలేకున్న దుఃఖమురా, కాని
వనితగల్గెనేని వగవదుఃఖమురా ‖ నాద ‖
ధనము లేకున్న దుఃఖమురా, చాల
ధనము గల్గెనేని దాచదుఃఖమురా ‖ నాద ‖
పచ్చికుండ వంటిమేను, ఇది
చచ్చుగాక ఆత్మ చావదెన్నడును ‖ నాద ‖
విచ్చికుండ వ్రక్కలైనా, లోన
హెచ్చియున్న బయలు విచ్చిపోదౌన ‖ నాద ‖

## ౧౮౧ చిలుకా

—తెలుగునాట వ్యాపించిన తత్వాలు వైష్ణవముద్వారా విశిష్టాద్వైతమూ, యోగముద్వారా అద్వైతమున్నూ. విశిష్టాద్వైతము ఏవోకొన్ని భక్తికీర్తనలలోనేకాని, వాటిని దాటి తత్వ రూపము పొందినట్లులేదు. కాకతిప్రతాపరుద్రుని సమకాలికుడని చెప్పబడు కృష్ణమాచార్యుల వారు, తిరుపతిలో అన్నమాచార్యులవారూ మాత్రమే విశిష్టాద్వైత స్ఫురణగల గాయకులు. రామదాసు ద్వైతిలాగునే కీర్తనలు చెప్పి ఎక్కడో ఒకచోట 'అంతా రామమయం' అన్నాడు. కాని శైవమూ, దాని పరిణామముగా వ్యాపించిన అద్వైతమూ మాత్రమే దేశములో విరివిగా వ్యాపించినవి. వేమన, పోతులూరి వీరబ్రహ్మయోగి, సిద్దప్ప, నాసరుద్దీన్, పీర్ మోహిద్దీన్, పోకల శేషాచలనాయుడు, పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి అచలయోగులు. వీరిసాధనలో గురుపూజ, వైరాగ్యము, అద్వైతమూ సోపానములు, తెలుగునాట సాధువుల మఠములలో ఇప్పటికీ అద్వైతసాధనయే జరుగు చున్నట్లుపరిశీలించి తెలుసుకొనవచ్చును. ఈడ పింగళలు, సుషుమ్ననాడి, కుండలిని, బ్రహ్మరంధ్రము అనునవి ఈ అచల యోగకీర్తనలలో విరివిగా కనపడును. మెదడుచించుకొన్ననూ బోధపడని మర్మ తత్వాలీ వంగడములోనివే.

చిలుకాను పెంచేను యెదముద్దులాడేను
కనుసైగలేదయ్యో చిలుకా ॥
మూణ్ణాళ్ల ముచ్చటకు మురిసేవు దిరిసేవు
ముందుగతి కానవే చిలుకా ॥
కుక్కి మంచముమీద కూలబడిపోతేను
దిక్కెవ్వరే నీకు చిలుకా ॥
ఇల్లుయిల్లనియేవు యిల్లునాదనియేవు
నీయిల్లు యెక్కడే చిలుకా ॥

వూరికీ వుత్తరాన సమాధిపురములో
కట్టె యిల్లున్నదే చిలుకా ॥
కఱ్ఱలే చుట్టాలు కట్టెలే బంధువులు
కన్నతల్లెవ్వరే చిలుకా ॥
నువుకాలి పోయేదాక కాపలుండుకుగాని
వెంటనెవరూరారు చిలుకా ॥

---

## ౧౮౨ విష్ణు ఈశ్వర బ్రహ్మ ముగ్గురూ

విష్ణు ఈశ్వర బ్రహ్మ ముగ్గురూ
అన్నదమ్ములంట

ఈ భూదేవీ ఆకాశ వాణికీ

వారె కర్తలంట

వారి మహిమతో చేసిరీ ఒక

మట్టి బొమ్మనంట

ఈ తొమ్మిది కిటుకుల దర్వాజాలూ

మాట లాడుకుంట || విష్ణు ||

వస్త్రా వట్టిదె పోతా వట్టిదె
ధర్మము తనవెంట

సాంబశివుడు నినుపిలువ నంపినడు

జల్దిగ రమ్మంట || విష్ణు ||

చేతులో బెల్లం ఉన్నంతసేపే

కాకి బలగమంట

చేతిలో బెల్లం సరిపోయినాక

ఎవరు రారు వెంట || విష్ణు ||

ఇంటి ముంగిటా పిల్లమేకలు

ఇల్లు బలగ మంట

ఎడ్చేవారు మరి ఆర్చేవారు
ఎవరు రారు వెంట ॥ విష్ణు ॥

తొలినాడు యమలోళ్ళ సైనతను
గుంజుకు రమ్మంటా

యమలోళ్ళంతా చుట్టునిలిచినకు
తాళ్ళూ తెమ్మంటా ॥ విష్ణు ॥

చిన్నపెద్దలూ కూర్చున్నారు
చింతలు పడుకుంటా

నీళ్ళుబోసి కూర్చుండ బెట్టినరు
మాయ బొమ్మ నంట ॥ విష్ణు ॥

పువ్వుల దండలు వేసినరయ్యా
మాయ బొమ్మ కంట

ఎత్తుండి ఎత్తుండి ఎత్తుండోయి
మట్టి బొమ్మనంటా
దింపుడు కల్లముకాడ దింపినరు
మాయ బొమ్మ నంటా

సొమ్ము సమస్తము తీసుకున్నరూ
బోతరు వారంతా
గురువు పోస్తడూ శంఖు తీర్థమూ
ముక్తి ఫలము కంటా

- మంట్లో మన్ను కలిపినారు ఈ
పూయ బొమ్మ నంటూ
ధన ధాన్యంబులు ఎవని పదార్థము
ధర్మమె తన వెంట
చేసిన పుణ్యము పాప కర్మములె
వచ్చును తన వెంట ॥ విష్ణు ॥

---

# ౧౮౩ తుమ్మెద పదము

— తుమ్మెద పదములను గురించి పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 1300) మొట్టమొదట చెప్పినాడు. ఈపదాల చరణముల చివర తుమ్మెదా అన్నమాట విధిగా వచ్చుచుండుటచే ఇదే ఈ పేరునకు కారణము. తుమ్మెదా అన్నది ఈ తత్త్వములోవలె జీవుని గాని, అన్నమయ్యాది, 'తొల్లిటివలెగావు తుమ్మెదా' అన్న సంకీర్తనములో వలె పరమేశ్వరునో — 'ఏపూరు ఏపల్లె తుమ్మెదా' అన్న పాటలోవలె ఒకవ్యక్తినో ఉద్దేశించి అనేమాట. ఈపదము ఏగంటి వచనాలలోనిది. ఏగంటి సంజేశ్వరునికి అంకితము. గార్లపాటిలక్ష్మయ్యగారు రచించినది. ఈయన పోశెట్టి లింగకవికిగురువే అయినచో ఇంచుమించు అన్నమయ్యకు సమకాలికులు అయియుందురు. ఈ యిద్దరి రచనలకున్నూ గతి సామ్యము చాలాకనబడుతున్నది. సంప్రదాయము ఈయన రచనలను "వచనములు" అన్నను, పోశెట్టి లింగకవి "పాటలు" అనే అన్నాడు.

శ్రీకంఠుడను పువ్వుతుమ్మెదా – మూడు
లోకమ్ములాయెను తుమ్మెదా
సాకారమైయుండు తుమ్మెదా – పర
మైకాంతమున జూడు తుమ్మెదా
శివశివాయనవె తుమ్మెదా
శివుడనగ విన్నమేల్ తుమ్మెదా
శివుని భక్తులాకు తుమ్మెదా
శివశరణన్నమేలె తుమ్మెదా ౧
ముట్టిముట్టని పువ్వు తుమ్మెదా
ముట్టింది జగమెల్ల తుమ్మెదా
ముట్టిచూడవేల తుమ్మెదా – అది
ముట్టిపాయలేవె తుమ్మెదా ॥ శివశివ ॥ ౨

యవ్వానమందావె తుమ్మెదా, బహు
పువ్వాల వాసానె తుమ్మెదా
క్రొవ్వి నీవెఱుగావె తుమ్మెదా, నీకు
నెవ్వినేరములేదు తుమ్మెదా ॥ శివశివ ॥ ౩

ఆఱురేకుల పువ్వుతుమ్మెదా – అది
మీఱిన వాసానె తుమ్మెదా
వేఱుసేయక నీవు తుమ్మెదా, శివు
జేఱిభజియించవె తుమ్మెదా ॥ శివశివ ॥ ౪

యీళ పింగళలు తుమ్మెదా, సుషుమ్న
నాళి మధ్యమున తుమ్మెదా
మేలిమెఱిగే నీవు తుమ్మెదా, శివ
కేళిజరించావె తుమ్మెదా ॥ శివశివ ॥ ౫

ఏడుగురు రాజులు తుమ్మెదా, నీకు
జూడ బండ్లుజోడు తుమ్మెదా, వట్టి
యాశగోసివేసి తుమ్మెదా
మోసపోకుమంటి తుమ్మెదా భక్తి
రాశికెక్కుమంటి తుమ్మెదా ॥ శివశివ ॥ ౬

అష్టదళము మీద తుమ్మెదా నీవు
మెట్టి చరించావె తుమ్మెదా
కష్టాము నెఱుగావె తుమ్మెదా, నీవు
స్రష్టవైయుండావె తుమ్మెదా ॥ శివశివ ॥ ౭

తొమ్మిది వాకిళ్లు తుమ్మెదా, నీవు
నమ్మి చేరినావె తుమ్మెదా
ముమ్మూల కోణాల తుమ్మెదా నీవు
నెమ్మది నుండావె తుమ్మెదా ॥ శివశివ ॥ ౮
పది పదేనింటనూ తుమ్మెదా, కొండి
పదునొండు తావులను తుమ్మెదా
మెదలాక నిల్చినా తుమ్మెదా నిన్ను
కదలించగలరటే తుమ్మెదా ॥ శివశివ ॥ ౯
ఎనసితోట పువ్వుతుమ్మెదా నీ
ఘెనయమానలేక తుమ్మెదా
దానిచేజిక్కినా తుమ్మెదా, తోట
వానిచేబడుదూవె తుమ్మెదా ॥ శివశివ ॥ ౧౦
నింగినేలవేయు తుమ్మెదా
గంగ గవురు లేనినాడు తుమ్మెదా
పొంగుచును నొరబోడ ? తుమ్మెదావేయు
భంగులానటియించు తుమ్మెదా ॥ శివశివ ॥ ౧౧
వేయిరేకుల పువ్వు తుమ్మెదా, అది
వెలుగూను జగమెల్ల తుమ్మెదా
సద్గూరు నడుగావె తుమ్మెదా పువ్వు
సద్యజూపూనీకు తుమ్మెదా ॥ శివశివ ॥ ౧౨
గురునాకు హరునాకు తుమ్మెదా, అం
తరువులేదేమి తుమ్మెదా

గురుపాద పద్మాలు తుమ్మెదా, నిన్ను
దరిశించు మంటిని తుమ్మెదా ॥ శివశివ ॥ ౧౩
గురుడు నీశిరమూన తుమ్మెదా, మా
గురుడు నీశిరసూన తుమ్మెదా
కర పద్మములు మోపి తుమ్మెదా
ఆరయ నేగంటీశుడుండు తుమ్మెదా ॥ శివశివ ॥ ౧౪

ఈ పాటలో 'శివశివ...' అన్నది పల్లవి అనవచ్చును. ఈపాట అన్నమయ్య సంకీర్తనలు, జయదేవుని అష్టపదులు వలెనే చరణము పల్లవి చరణము పల్లవి, లతో సాగిపోయినది. ఆనాటికి అనుపల్లవి ఏర్పడలేదు.

---

# ౧౮౪ బ్రహ్మముగారి దర్శనము

నే జూచినానే-బ్రహ్మమునాలో-నేజూచినానే
సద్గురునాలో-నే జూచినానే

నే జూచినానమ్మ నెలతరో తాంక
రాజయోగము నందు రంజిలు నాగురుని ॥ నే ॥
కన్నుల నడుమాను సన్నంపుదిడ్డినా
తిన్నాగ వెలిగేటి పున్నమచంద్రుని ॥ నేజూచి ॥
ఫాల భాగమునందు. నీలజ్యోతుల నడుమ
వోలలాడు చున్న పంలింగమూర్తిని ॥ నే ॥
చూపులలోపల పాపల నడుమను
వ్యాపించి వెలిగేటి ఆపరంజ్యోతినీ ॥ నే ॥
చక్షురాగ్రమునందు పశ్చిమవీధిని
నిక్షేపమయి వెలుగు సాక్షిభూతునినాలో ॥ నే ॥
చందమామకు నడుమ కుండలాకృతియని
ఆనందముగ నేడుహరి పోతులూరయ్య ॥ నే ॥

---

## ౧౮౫. ఒ రే ఒ రే

చిల్లర రాళ్ళకు మొక్కుచునుంటే
చిత్తము చెడిపో నోరేఒరే
చిత్తము నందున చిన్మయ రూపుని
చూచుచు నుండుట సరేసరే
ఒక్కపొద్దులని యుండుచునుంటే
ఒనరుగ చెడుదువు ఒరేఒరే
ఏకమైన యా వైభవ మూర్తిని
చూచుచు నుండుట సరేసరే
నీళ్ళలోమునిగీ గొణుగుచు నుంటే
నిలకడ చెడునుర ఒరేఒరే
నీళ్ళలోవుండే నిర్మల జ్యోతిని
చూచుచునుండుట సరేసరే
బాధగురువుల పంచను చేరితె
భావము చెడునుర ఒరేఒరే
భావమందునా బ్రహ్మశాంతినీ
చూచుచునుండుట సరేసరే
భూములు అడవులు తిరుగుచునుంటే
బుద్ధులు చెడునుర ఒరేఒరే
బుద్ధిలోవుండే పున్నమచంద్రుని
చూచుచునుండుట సరేసరే

## ౬ సిద్ధప్ప కులము

..మని ననువివరమడిగితే
ఏ చెప్పుదు లోకులకు
లోకులకూ పలుగాకులకు దు
ర్మార్గులకూ ఈ దుష్టులకు ॥

ఫాలభాగమున యాలలుపాడుచు
భావము గన్నది నాకులము
ముట్టున బుట్టిందీ కులమూము
ట్టంటున పెరిగినదీ కులము

ముట్టులో హరుడు ముట్టులో శివుడును
ముట్టులో బ్రహ్మం ముగ్గురు మూర్తుల
మూలము దెలిసిందీ కులము

ఇంటిలోపలను యిల్లుగట్టుకుని
మంటలోపల రాట్నం బెట్టుక
కంటిలోపల కదురు పెట్టుకొని
ముక్కులోపల యేకు బెట్టుకొని
చెవులోబాకా చేతికితీసుక
నారాయణయను నరము తీసుకొని
అష్టాక్షరియను తడికె వేసుకొని
పంచాక్షరియను పంచదీసుకుని
తధిమి తధిమి గుబదెబగుబ దెబగుబ
ఏకినకులమే మాకులము ॥

## ౧౮౨ చందమామ

చందమామ చందమామ చందమామ ఈ
సంధి తెలిపే జ్ఞానులెవరె చందమామ
జంట నాగస్వరములూది చందమామ
పాముని పాదుపెకలించాలి చందమామ
తొమ్మిది వాకిళ్లుమూసి చందమామ
పామునిపట్టవలెను చందమామ
కాయమనే పుట్టలోను చందమామ
మాయగానె మెలగియుండు చందమామ
భక్తియనే కట్టుకట్టి చందమామ
యుక్తిచేత పట్టవలెను చందమామ
దేహిదేహముల సందు చందమామ
తెలియకుండ చుట్టుకుంది చందమామ
ఆ జపమంత్రి ధ్యానముచేత చందమామ
అఖండ కళలతో వెలుగుచుండు చందమామ
పాముపట్టేజోగి యెవరె చందమామ
అతనిపేరు సిద్ధగురుడె చందమామ

---